హంలో యిప్పటికే యెన్నేళ్ళో వృథా చేశా యిం కాలయాపనం చెయ్యను—శోక మృత్యుభూయిష్ఠమైన యీ మహాసంసారసాగరాన్ని చిలికి నీకానంద నవనీతాన్నందిస్తాను భయపడకు దేవీ!

భూ: (నిట్టూర్చి) అమ్మయ్య! అమృతంకన్నా చల్లని నీ అభయవచనంతో నా దుఃఖం తీరినట్లయింది యీ దీనురాల్ని విస్మరించకు ప్రభూ! చంద్రుని కోసం చకోరిలా మీ కోసం నిరీక్షిస్తూ వుంటాను నిత్యోత్సుకనై రా లోకతె మీరాక కెదురు చూస్తూ వుంటుందన్న సౌకర్యం యీ విశాల హృదయంలో యేమూలనున్నా చాలును ప్రభూ!, నా

(భూదేవి వెళ్ళిపోతుంది)

గౌత: (జాలిగా) వెళ్ళిపోయింది. ప్రావృట్కాలనీలాంబుధరం వలె కన్నులవిందైన దేవీ సస్యశ్యామలమూర్తి దీనంగా యెలా తేలిపోతూ వుందో! (నిట్టూర్చి) ముందీ రాజభవనాల్లోనించి బయట పడితేగాని గాలి పీల్చుకోలేను—సాలీడుగూడల్లా నాచుట్టూ సంసారబంధనాలెలా అల్లుకున్నాయో! యివి తెంచరాకుండా యెంత గట్టిగా వున్నాయో! అనురాగాలూ, యీ భోగాలూ, ఆనందాలూ, అనుభవాలూ అన్నీ సంకెళ్ళై నన్ను కాలు కదల్నిచ్చేట్టు లేదే! ఎలా వెళ్ళగలను?

రాజ్యలక్ష్మి (ప్రవేశిస్తూ) ఎక్కడికి యువరాజా!

గౌత: ఎవరమ్మా నువ్వు? నిన్ను చూస్తూ వుంటే మాతల్లి గౌతమికివలె నీపాదాలకు ప్రణమిల్లాలనిపిస్తూవుంది ఎవరు తల్లీ నువ్వు?

రాజ్య: నేను మీరాజ్యలక్ష్మి న్నాయనా! చిరతరమూ నీపూర్వులు శాక్యరాజులు వారి భుజస్కంధాలమీదగా చిక్కని ముత్యాల గొడుగు నీడల్లో నీ ఒకతుని దాకా నడిపించుకొచ్చారు యిహపరాలు రెండూ సాధించుకున్నారు మీ తండ్రిగారు జరాభారానికి తోడు నిత్యప్రవృద్ధమైన రాజ్యభారాన్ని కూడా భరించలేకుండా వున్నారు. వారిని వానప్రస్థం పిలుస్తూవుంది యిక నువ్వాయనకు విశ్రాంతి నివ్వాలి బలయౌవన సంపన్నమైన నీ భుజశిఖరాన నన్ను ప్రతిష్ఠించు!—

గౌత: లేదు తల్లీలేదు! యీ బంగారు పంజరంలో నన్ను బంధించుకోలేవు. రాచరికపు తొడుగునించీ తెరిపికోసం నా ఆత్మ తహతహలాడుతూ వుంది

రాజ్య: (ఆశ్చర్యంగా) ఏమంటున్నావ్? (అనునయిస్తూ) నువ్వు చేదేమిటో నీకే తెలియడం లేదు. రాజ్యాన్ని త్యజిస్తానంటున్నావ్ పిచ్చి తండ్రీ! రాజ్యబంధం ఐచ్ఛికం కాదు నాయనా! ఆనుపూర్వికమైన మహత్తర విధినిర్వహణం! అమాయకుడా! యీపూలతోట నీకు ముళ్ళతోటయిందా? యిది కాదని నిరాకరించి యింతకన్నా నువ్వు సాధించేదేమిటి?

గౌత: ప్రపంచ కళ్యాణం తల్లీ

రాజ్య: (వెక్కిరింపుగా) ఏమిటయ్యా ఆ ప్రపంచ కళ్యాణం! దొంగలా అర్ధరాత్రి గృహత్యాగం చెయ్యడమేనా? పిరికివాడా! మనువు మొదలు నీ వరకూ వచ్చిన రాజమార్గంలో ముళ్ళ కంచెలు వేస్తున్నావా?—సర్వాన్ని నిలిపి— దేశాన్ని సుభిక్షంగా – ప్రజల్ని కన్నతండ్రిలా పాలిస్తూ, శాంతిజ్ఞానదీపికలు వెలిగించి వన్నెగాంచి సాధిస్తూ నీ భోగ్యాలు పండించుకోరాదటయ్యా! నీ ప్రపంచాన్ని నేను కానా? యింతకన్నా క్షత్రియ జీవితపరమార్థమేమున్నది?

గౌత: వున్నదమ్మా! వున్నది ప్రపంచమంటే ఒక్క యీ కపిలవస్తు నగరమేనా తల్లీ?—కాదు ఒక్కసారి నీ చూపు త్రిప్పిచూడమ్మా! ఆధ్యాత్మికంగా లోకం యెంత దిగజారిపోతూవుందో! ప్రజల్ని పాలించే రాజులకాదిప్పుడు కావలసింది వారి ఆత్మల్ని పాలించే ఆచార్యుడు కావాలి దుఃఖాంధకారాన్నించీ అవిద్యాగర్తాలు దాటిస్తూ అహింసాజ్యోతితో శాంతిమార్గాన్న నడిపే మార్గదర్శి కావాలి! అందుకే నన్నీ బంధనాల్నించి విముక్తుణ్ణి చెయ్యితల్లీ! అంతఃపురాల్లో లభ్యంకాదా ఆత్మసాక్షాత్కారం నా తపస్సు పండితే మొదట నీ సేవకే వస్తానమ్మా!

రాజ్య: నవనీతసుకుమారమైన యీ తనువూ తారుణ్యం, రాజసుఖాల కలవాటుపడ్డ యీ ప్రాణం నీకు వశమై నీ కఠోరదీక్ష కనుకూలిస్తాయా అని— అయ్యోపాపం! నీమీద ప్రాణాలుపెట్టుకున్న ఆ

వృద్ధభూపతి పాట్లేం కావున్నాయో! నీ కౌగిళ్ళ ఎదురుచూస్తున్న కీర్తి, ప్రాభవం, జయశ్రీ—అన్నీ వృథా! వృథా!!

గౌత తల్లీ! నీకు నమస్కారం నన్ను ప్రలోభపెట్టకు నాలో రేగిన యీ మహోత్కృష్ట మందాకినీసందర్శనంతో కాక యింతా అంతా తీరేది కాదు నన్ను పోనియ్ నా ఆత్మకు బలం విశ్వాసం ప్రసాదించు అదిగో భూదేవి పిలుపులు వినిపిస్తున్నాయ్ మా కులపతులైన శాక్యరాజులవలె నిన్ను సేవించలేకని నా దుర్బలత్వాన్ని క్షమించి నన్ను దీవించిపంపు తల్లీ!

రాజ్య శుభం తండ్రీ శుభం! నీ సాధనలో నీకు జయం కలుగుతుంది పోయిరా నాయనా! ప్రపంచాన్నంతా శాంతంచేసి దివ్యజ్ఞానిని ప్రమదావనంలో క్రీడాసరస్సుకు మలపాలనుకున్నా—తెలుసుకున్నా—లోకానుగ్రహణార్థం అవతరించిన మహామూర్తివి నువ్వు! జరామరణవ్యాకులితమై హింసా శోకవ్యాకులమైన ప్రపంచాన్ని త్వరగా వుద్ధరించు ప్రభూ! యిక నాకు సెలవు (వెళ్లిపోతుంది)

గౌత కన్నతల్లి దీవనల్లా రాజ్యలక్ష్మ్యపలుకులు నాలో వినూత్నశక్తి ఉద్దీపింప చేస్తున్నాయ్

(దూరాన్నుంచి గజ్జెల ఘల్ఘలలు మువ్వల మోతలూ వినిపిస్తాయి)

గౌత (ఆలోచిస్తూ) ఎక్కడివీ కరకంకణ ప్రసులతో చరణమంజీర ఘలంఘలలు! పరి క్రొత్త మవ్వంలాగా యెంత మధురంగా మత్తెక్కిస్తూ వున్నవి! అంతఃపురానికి యశోధర విచ్చేసిన ఆ తియ్యని రోజుల్ని గుర్తుకు తెస్తున్నాయీ ధ్వనులు—ఎవరక్కడ?

యవ్వనశ్రీ నేనే నీలోవున్న యవ్వనశ్రీని. నా సంభావనంత వినా యెక్కడికీ అంతెరుగని ప్రయాణం—యెందు కింత వైరాగ్యం? యేమిటలా కృశించి తపించి సాధించేది? అందుకొక్క తలపిన వయసు ముందున్నది యిప్పట్నుంచీ యీ తపన దేనికోయ్! వెన్నెల్లో నిల్చి చీకట్లని పిలిచే వెర్రివాడివవుతున్నావే! యీ యవ్వనం కాస్తా జారితే—మధువొలికిన పాత్రెవరికొక్కవాలి? పూలు పూచే యీ వయస్సులో యేమిటీ మూర్ఖపుకోడం? యీ జన్మ, యీ సౌందర్యం, యీ యవ్వనం, యే మహాక్షేత్ర తపస్సు చేస్తే లభించాయో ఊహించావా? యీ దైవప్రసాదాల్ని భగ్నం చెయ్యడానికి నీకేం అధికారం వుంది? వసంతాన్ని శిశిరంగా మారుస్తావా? యెవరు నీకీ దుర్మార్గాన్ని ఉపదేశించింది? అనుభవహీనమైన జీవితం అడివిలో పువ్వులా రాలిపోతుంది ఓయ్ విపరీతబుద్ధీ! ప్రత్యక్ష చంద్రికను పరిత్యజించి కనబడని కౌంకులకోసం పరిగెత్తి పడతావంటున్నావ్! నా మాట విను హాయిగా సుఖించు

గౌత (కఠినంగా) ఆగు! యిక నీ ఊహాగానం నిలుపు! క్షణికమైన యవ్వనానికిన్ని రంగులు పులిమి యింద్రధనుసు చేసి చూపిస్తున్నావ్ యెంతసేపు దీని వైభవం? చాల్ చాలు నీ ఆనందపు లోతు తెన్ను నెరగనివి కావు యీ దారిలో యెండమావులు! పృథ్వి వ్యాకులుముంబవాలు—వన్నికి భ్రమపెట్టలేవు పో పో!

యవ్వ ఓరి మూర్ఖుడా! విప్పి చెప్పినా తెలుసుకోలేకపోతున్నావ్ పోనీ కాని, యీ గడిచినరకూ నిన్నే నమ్మి నీకోసం తన విశ్వాసాన్ని భద్రపరచుకున్న చరణదాసీ హృదయరాజ్ఞి యశోధర కన్నా యీ జన్మలో నీకు లభ్యమయ్యే పరమార్థమేముందిరా? నువ్వింత విశ్వాసఘాతుకుడవనుకున్నదా ఆ అమాయకురాలు? అప్పుడే మరిచిపోయావా వికజాము క్రితం యశోధర యేమన్నదీ—గుర్తు తెచ్చుకో—

(—లోపల్నించి వినిపిస్తున్నట్లు—)

యశో ప్రభూ! యీ చరణదాసిని అన్యాయం చేయకండి యీ హృదయానికి దీప్తి మీరూ, యీ కన్నులకు వెన్నెల రాహులుడూ—

గౌత (పుశ్వాసంతో) అన్యాయ దేవీ! నీకన్యాయం చేస్తున్నానా?—అదిగో (వింటూ వున్నట్టు) మళ్లీ యెవరిదా ఆక్రందనం—

(మళ్లీ లోపల్నించీ వినిపిస్తున్నట్లు—)

భూదేవి యీ దీనురాల్ని విస్మరించకండి ప్రభూ! చంద్రుని కోసం చకోరిలా నిరీక్షిస్తూ వుంటూ—

గౌత (దృఢస్వరంతో) వస్తున్నా భూదేవీ! వస్తున్నా (కోపంగా) ఓసి యవ్వనశ్రీ! నీ దుష్టతంత్రా

లీక చాలించు గౌతము వంటి చంచలుడు కాడు పో పో!!

యశ్వ వోరి అవివేకీ! కడసారిగా చెబుతున్నా విను యీ కాషాయంతో నువ్వు సాధించే దేముందోయ్? తల బోడైతే తలపులు పోడవు తాయా? చూడు, వృథ యత్నము డవు కావు, కాదంటావా నీకర్మ పోనీ యీవిశ్వరూపాన్నే యశోధరతో చెప్పి పో అది మంచిమార్గం—చూడరా, అటు చూడు—

అదిగో నీప్రణయాధి దేవత సతి
స్వప్నానంద సందీప్తి ము
ఖ్యదనాంతమ్ముల హాసరేఖల
యాహ్వానించుచునో విన్ను - ఓ
రి దయాలిస్యుడా! చూడు మేడగుడ
రహః క్రీడాపథాలోచనా
త్యుదితప్రేమ కలనంబో పంజమును
ప్రాయున్ పెక్కుపట్టాలపై
చూడు చూడు—

ముద్దుల మాటగట్టు వలె మోమున
తిల్లిపయాంట క్రోయుమన్
సద్దుదొరంగి రొమ్ము వకు చల్లని
చేతులు సాచుచున్న నీ
నిద్దపు ప్రేమ, శాశ్వతుల నీల
నభశ్శిరేఖ అచ్చువం
ప్రద్దివయట్టి నీకు ప్రతిరూపము
బిడ్డనిరంక చూడరా!

నీ వంటి విరసపాషాణ మూర్తులతో వాదు పని లేదులే—(గట్టిగ కలగలలతో వెళ్లిపోతుంది)

గౌత (నిట్టూర్చి) అబ్బ! యిప్పటికి అవాంతరాలు తీరిపల్లే వారిధికి సేతువు కట్టినట్లయింది వాత్రభయాలే నన్నింతగా పుటం పెట్టి పరిశుద్ధుణ్ణి చేశాయ్ (తల్పంనించి లేస్తాడు వక్కసారిగా బాకాలు మ్రోగి నిల్చిపోతాయి)

## 3

"ఆహో దేవతల్లారా!"

దేవ అదిగో అశరీరవాణి యేమో చెబుతూ వున్నది వినండి వినండి

అశరీరవాణి (ఆనందంతో) ఓహో దేవతల్లారా! స్వామి లేచారు విశ్వకళ్యాణంకోసం స్వామి బయల్దేరారు ఓ నిద్రాధిదేవతా! నీ వెచ్చని కౌగిళ్లలో అంతఃపురాన్ని జోకొట్టి నిద్రపుచ్చాలి. స్వామి నిర్గమించేవరకూ యే ప్రాణీ మేలుకోరాదు ఓహోయ్ విశ్వబద్ధదేవతల్లారా! స్వామి మార్గాన్నంతా బాగాలంతీరి నిలవండి విఘ్నరాక్షసులు పొంచుండి మీ ప్రయత్నాలు భగ్నం చేస్తారేమో జాగ్రత్త! మీ సన్నని నిట్టూర్పుగాలులతో నిశ్శబ్దంగా అంతఃపురద్వారాలన్నీ తెరిచివుంచండి అదిగో స్వామి బయలుదేరుతున్నారు ముందట మీ నిర్మలకోశపాశాల్తో మార్గమంతా సమ్మార్జనం చేసి నిరటంకం చెయ్యండి వింటున్నారా? స్వామి రత్నపాదుకల ధ్వనులు కూడా వినిపించకుండా పువ్వుల కన్నా మెత్తని మీ అరచేతుల్ని నారిపాదుగునా అరుణాంబుజ మాలికల్లాగా పరచండి స్వామి మీ పాణిపల్లవాలమీదుగా నడిచిరావాలి ఓ అదృశ్య దేవతల్లారా! జగత్కళ్యాణంకోసం స్వామి బయల్దేరి వస్తున్నారు చెన్నుని మేల్కొలపండి! కంటకాశ్వాన్ని సుసజ్జితం చేసి సౌధద్వారంవద్ద నిలిపించండి ఓ వాయుదేవతల్లారా! స్వామి నిష్క్రమించేవరకూ మీలోవున్న శబ్దప్రసారగుణాన్ని స్తంభించుకోండి యీ నగరసీమ లతిక్రమించేవరకూ యే ప్రాణికూడా అశ్వఖురన్యాసరవళి వినకూడదు! నక్షత్రాల్లారా! స్వామిమార్గానుకూలంగా మీ వెలుగులు పట్టండి (ఉత్సాహంగా) వచ్చేశారు స్వామి వచ్చేశారు వచ్చేశారు—

వేయి యామినులొక్క రేయి తోచినయట్లు
తియ్యని తావులు తెరలివచ్చి,
కోటిచందురులొక్క చోట వెల్గినయట్లు
విరిసిన కాంతుల నల్లివచ్చి,
శ్రుతిగుస్వనములొక్క శ్రుతిని మ్రోగినయట్లు
అడుగు సవ్వడులల్లనల్ల వచ్చి,
సకలభాగ్యములొక్క సారి కూడినయట్లు
చిరకాంక్షిత స్వప్నసిద్ధివచ్చి
వచ్చివచ్చి విపన్న జగద్భయంబు
ఆదుకొను వరదాభయ హస్తముద్ర
స్వామిగా నెట్టయెదుట సాక్షాత్కరించె
శాశ్వతంబౌ తమోరాశి చంద్రవంక

అశరీర ముక్కోటి దేవతల ఆనందాశ్రువులతో పాటు పరిమళ పారిజాత మందార మకరందబిందు

పూలు జల్లుజల్లుగా పడుతూ వున్నాయ్. ఆ పూల వానలో స్వామి అశ్వాన్నధిరోహించిం చాల వేగంగా గాలిలో లేచి మబ్బులలో తేలి పోతున్నారు. నగరప్రాకారాలపైనించి ఎగిరిపోయే స్వామిని ముందుగా ఆకాశంలో చెన్నుడు కూడా నడిచిపోతున్నాడు. నిష్క్రమించాడు స్వామి నిష్క్రమించాడు—

“ఆ సుహాసోదయ మోహన ముఖాంబుజాన్ని
సడి చుట్టి చెలుని

స్వామి పవిత్రతేజ మవికల్పక
శాంతిసమాధి నిష్ఠ హిం
సామలిన ప్రపిష్టు, లిహ పంగుల
ధర్మ్య పదమ్ము పట్టి స్వ
ర్గ్యసుఖరాత్ములై భువి
తరింపగ సత్వర ముద్ధరించుతన్!”

వహో రెన్న గగనతో ఆనహాతో సమ్మోహం బుద్ధాని—

---

# నా ప్రభూ!

★ శ్రీ బెళ్లారి శ్రీనివాసమూర్తి

నందు మనోజ్ఞహర్మ్యసుఖ వాసనలెవ్వియు—జీవితంబులో
తలపునలేని సౌఖ్యములు—త్వత్కరుణామృత వాహినీసము
జ్జ్వల మధురాంబుపానములు పల్కెదు చిన్నికుటీరసీమ, నీ
చెలిమికి నాదు ప్రాణములు సిద్ధముచేసితి రమ్ము నా ప్రభూ!

ప్రేమయొకండె నిన్ను వలపించెడు వస్తువటంచు నాదు హృ
త్సీమకు దోచిపోయినది, తియ్యని నాయనుభూతి నొల్లని
ప్రేమకు ధారవోసితిని రెక్కలువిచ్చిన యాశగాగ నా
ధామము చెంగ్రవాలుదు గదా క్షణమాత్రములోన నా ప్రభూ!

అల్లన కంఠమెత్తి ప్రియమారగ పిల్చిన, నా స్వరంబులో
పల్లవితంబుగా మృదుల భావనలన్నియు గుస్తివట్టనా
యుల్లనివాస్తు నియ్యెడకు నిన్నెదకున్ జనవింక, తేను పూ
వల్లరి నీవు వృక్షమవు ప్రాకెద నిమదియొల్ల నా ప్రభూ!

ఎన్నడు నీవు లేవొ భవి నెందును నేనును లేనుగాన, న
కున్న సమస్త మీవొకడవే యను శాస్త్రమె నాదిగాన, సి
చిన్నెలులేని నా బ్రదుకు చేదయి తోచునుగాన, నన్ను ని
కిన్నెల కౌగిలింతకడగా నొనరింపగ రమ్ము నా ప్రభూ!

నీ వొక బాటసారివయి నిల్తువు నా గృహసీమచెంత సం
ధ్యావిపులాంధకారముల నక్కట—ఆకలి దప్పి దీర్చి నీ
త్రోవకు చల్దిగట్టి పరితోషమునన్ పయనింపజేతు మ
ద్భావపరీమళంబు దనుకన్ తొలి వెల్గులలోన నా ప్రభూ!

---

# స్థాయిభావములు



శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

శృంగారము మొదలుగాగల రసము లెనిమిది గలవు. ఈ రసములకు రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము అను ఎనిమిది స్థాయిభావము లగుచున్నవి. కాని స్థాయిభావమును నిర్వచించ వలసియున్నది.

ఎక్కువ ఆలోచన లేకుండా, బుద్ధిని వినియోగించకుండా, మన మనేక పనులను చేయుచున్నాము. ఇట్టి కృత్యముల నందరును దాదాపు ఏకవిధముగా చేయుట గలదు. పరిస్థితులు మారినను వీటిలో చెప్పదగినంత మార్పు కన్పించదు. అనుకరణగాని, అనుభవముద్వారా తెలిసికొని చేయుటగాని వీటిలో కన్పించదు. ఇట్టి కృత్యముల సాంఖ్యకున ఇన్‌స్టింక్టివ్ బిహేవియర్ "(Instinctive behaviour) అందురు. ఈ విధమగు ప్రవృత్తి ప్రతివ్యక్తిలోగల స్థాయిభావముల నాశ్రయించుకొని వచ్చునది. పరిసరములతో సమన్వయపరచుకొనుచు పోవు ప్రాణుల ప్రవృత్తిని స్థాయిభావ ప్రవృత్తి యందురు. ప్రాణరక్షణకు, వంశవృద్ధికి తోడ్పడు నీ స్థాయిభావములు ప్రతివ్యక్తియొక్క మానసములోని అంగములని యొక వాదము గలదు. కాని భావోద్రేకముగాని, జ్ఞానముగాని లేని స్థాయిభావప్రవృత్తి కేవల యంత్రపరంపరలోనిదగును. ఒకే ఒక స్థాయిభావప్రవృత్తిలో వివిధావయవములేల వ్యాపృతము లగుచున్నవో, ఈ వాదము చెప్పలేకున్నది. ఈ స్థాయిభావప్రవృత్తి జ్ఞానహీనమై, గ్రుడ్డిదైనచో సమర్థవగు దీనిని మార్పులను కాని అనుభవ మెక్కువైన కొలది ఈ ప్రవృత్తిలో మార్పులు కన్పించుచున్నవి.

స్థాయిభావప్రవృత్తికి మనస్సునకుగల సంబంధము వివేచనీయము. అనుభవమున, ప్రవృత్తిలోను, మనస్సు కొన్ని సన్నివేశముల నభివ్యక్తపరచుచున్నది. ఈ సన్నివేశములు సామాన్యముగా కొక్క తీరున కన్పించుటచే తద్ద్వారా అంతరంగికమగు మనస్సుయొక్క స్వరూపస్వభావములు మన కవగతము లగుచున్నవి. మనస్సు విభజింపబడియున్న వేళలో గూడ నీ స్వరూపస్వభావములు స్థావరముగా నిలచి అభివ్యక్తమగుచున్నవి. కాగా మనస్సు వివిధభాగములతో సంఘటితమై, ఆ అంగములతో సమన్వయము కలిగియున్న దనవచ్చును. ప్రతి భాగము తన కృత్యమును తాను నిర్వర్తించుటయేగాక, ఇతర భాగములతో సన్నిహిత సంబంధము కలిగియున్నది. తద్ద్వారా ఇతర భాగములలో దీనివలన మార్పులు రాగలవు. ఈ భాగములే స్థాయిభావములు. స్థాయిభావములకంటె విలక్షణమైన మనస్సు లేదని చెప్పవచ్చును. ప్రవృత్తి నిర్దేశించు అంతరంగికములగు స్థాయిభావములు మనస్సుయొక్క వివిధపరిణామములు. మానవప్రవృత్తి కందుచే నివి హేతుభూతము లగుచున్నవి.

స్థాయిభావనిర్దిష్టమగు ప్రవృత్తి ప్రయోజన సహితమైనది. ఒక వస్తువు నుద్దేశించగల భావన ఉద్దిష్టవస్తువును తెలిసికొనగల జ్ఞానము అనునవి రెండును లేనిచో ప్రయోజనము నెరవేరజాలదు. ప్రవృత్తి స్వాభావికమై, అయత్నసిద్ధమై, ఉద్దిష్టవిషయప్రాప్తివరకు నుండును. విషయప్రాప్తికి అంతరాయములు వాటిల్లినచో ప్రవృత్తిలో వేగములు బలము లుండును. అప్పుడు ద్విగుణితయత్నము నెరవేరుచున్నది. అనగా ప్రవృత్తిలో కొక అవగాహన మాత్రమే కదలుటగాక, శారీరకాధ్యాత్మికరూపముగు జీవయంత్రము వ్యాపృతమగుటకలగు శరీరసంఘటితమైన మనస్సు ప్రవృత్తిలో ప్రవేశించుటచే స్థాయిభావ ప్రవృత్తిలో జ్ఞానముండవలెనను మాటను తృణీకరించవలెను.

మనస్సుయొక్క స్వరూప విన్యాసమున స్థావరముగా నుండునవి స్థాయిభావములు. జీవి ప్రాణముతో నుండువరకు నీ స్థాయిభావము లుండగలవు. ప్రతి స్థాయిభావములోను జ్ఞానాంశ, ప్రవృత్త్యంశ అను రెండంశలుగలవు. వీటిద్వారా స్థాయిభావములోని శక్తి

స్వేచ్ఛను పొంది సక్రమమార్గమును పొందుచున్నది అనగా స్థాయిభావముల కన్నిటికి మూలభూతమగు జ్ఞానాత్మక శక్తినుండి బలముచేకూరుచున్నది ఈ మూలరాశినుండి కొన్ని స్థాయిభావము లెక్కువశక్తిని గ్రహించవచ్చును మరికొన్ని తక్కువ గ్రహించవచ్చును కాని ఈ శక్తి ప్రాణియొక్క చైతన్యము కంటె విలక్షణమైనది కాదు చైతన్యము సాపేక్షకమై విషయసంవలిత మగునపుడు స్థాయిభావములను రూపములద్వారా అవి వ్యక్తమగునని భావము ఉద్దిష్టవిషయము కనబడినపుడు అనుభవించు వ్యక్తికి ప్రమేయముతో నే అవ్యక్తత్వసంబంధముకలుగుచున్నది అనగా ప్రవృత్తి ఉభయాభినివిష్టమై ఉత్పన్నమగుచున్నది కేవలము విషయమునుండిగాని, కేవలము ప్రమాతనుండిగాని, ప్రవృత్తిరాజాలదు ఈ ప్రవృత్తిలో క్రియానందము లవినాభావసంబంధము కలిగియున్నవి

వ్యక్తులందరి స్థాయిభావ ప్రవృత్తులు ఒకే ఒక రీతిగా నుండవు వంశక్రమానుగతమగు సన్నివేశములు, అనుభవములు మొదలగునవి స్థాయిభావ ప్రవృత్తులలో విపరీతమైన మార్పులను తీసికొని రాగలవు ఈ మార్పులను గమనించినచో వీనిలో స్థాయిభావములే కల్పించుటలేదని గూడ చెప్ప సాహసింపవచ్చును అభిరుచి, జాగ్రత్త, పరిశీలన, ప్రవృత్తిలో మార్పు, అభ్యాసజనితమగు జ్ఞానము మొదలగునవి ప్రవృత్తులలో కల్పించుటచే స్థాయిభావము జ్ఞానసంవలితమని చెప్పవలయును

ప్రతివ్యక్తి ఉపయోగించగల మానసిక శక్తి స్థాయిభావ ప్రవృత్తిలో కల్పించును పరిశీలన, జాగ్రత్త మొదలగువానితో కూడియున్న దీక్ష కాగా కొన్ని ఇంద్రియములు కొన్ని విశిష్టవిషయములయందే వ్యాపృతములు కాగలవు నిరీక్షణ, పరిశీలన, అన్వేషణ మొదలగు నవీ వ్యాపారములో కల్పించును వీటి అన్నిటియందును క్రియాశక్తి అను వ్యాపకముగా గలదు ఈ క్రియాశక్తిద్వారా ఉద్దిష్టార్థ ప్రాప్తి జరుగగా స్థాయి భావము సంతృప్తినందుచున్నది దీనికి అంతరాయములు కల్గినచో ప్రవృత్తిలోగాని, సన్నివేశములలోగాని, మార్పులు తీసికొని రాబడుచున్నవి అనగా ప్రతిస్థాయిభావములోను జ్ఞానాంశ కలదని భావము జ్ఞానసంవలితమగుటచే స్థాయిభావప్రవృత్తి వివేకముతో మెలగుచు వైశిష్ట్యమును వంపగల్గుచున్నది ఈ జ్ఞానసంవలితత్వము ప్రథమప్రవృత్తిలో సహితము కల్పించుచున్నదని పరిశీలకులనుచున్నారు ప్రయోజనము జ్ఞానాధీనమగుటచే, ప్రవృత్తిప్రయోజనాన్వితమని చెప్పినచో మొదటి ప్రవృత్తిలో సహితము జ్ఞానము కలదని చెప్పవల్సె యగుచున్నది

క్రిమికీటకములయందు, పసుపక్షులయందుగల స్థాయిభావము ఉద్దీపన విభావముచే జ్ఞాన రహితముగా ప్రవృత్తములగుచున్నట్లు కల్పించుచున్నవి అట్టి ప్రవృత్తులు మానవులయందు చాల కొద్దిగా నున్నవి కొరుకుట, దప్పట్లు చరచుట, నోటివద్దకాహారమును తీసికొనిపోవుట, ప్రాకులాడుట, ధ్వనులను చేయుట, అరచుట, నవ్వుట, కోపగించుట మొదలగునవి మాత్రమే ఇట్టివి వీటిలో ఆలోచనగాని, జ్ఞానముగాని గోచరించుటలేదు. కాని మానవస్థితియందు మానసిక ప్రవృత్తులే అతి ముఖ్యములైనవి ఈ ప్రవృత్తులలో అభిరుచి, యత్నము, నిరీక్షణ, అన్వేషణ, కార్యసాధన మొదలుగాగల జ్ఞానాకారమే గోచరించును

స్థాయిభావమున బాహ్యవిషయ సందర్శనచే యత్కించిచ్చలనము కలిగిన తర్వాతనే ప్రవృత్తి ఉత్పన్నమగును ఈ కదలిక రాగానే స్తబ్ధముగా నున్న స్థాయిభావము పైకి ఉబుకును ప్రతి స్థాయిభావమున విశిష్టమగు సంచారిభావ మొకటి ఉండును ఈ సంచారిభావము సంవలితమైననే స్థాయిభావము ప్రవృత్తిమార్గమునకు దిగును కాగా ప్రవృత్తికి సద్యఃకారణము సంచారిభావమని తెలియవలెను స్థాయి సంచారి భావములు రెండును సదా జ్ఞానసంవలితములై యుండును భయము, ఉత్సాహము, జుగుప్స యనునవి స్థాయిభావములు కావచ్చును, లేదా సంచారి భావములు కావచ్చును స్థాయి సంచారిభావములు విలక్షణములు కావని, సంచారి భావరహితమైన స్థాయిభావము లేదని వీటివలన సిద్ధమగుచున్నది సంచారిభావము ద్వారా ప్రవృత్తియొక్క స్వరూప స్వభావములు మన కవగతము లగుచున్నవి కావుననే ధర్మాది శబ్దములు సందర్భానుసారముగా స్థాయి వ్యభిచార్యాదివాచకము లగుచున్నవని అభినవగుప్తుడనినాడు. అంతరంగికము అను [illegible]

స్వభావము లీ స్థాయిభావములని కంటకుడు సహితము వచించెను.

ప్రతి స్థాయిభావ ప్రవృత్తియందు విషయజ్ఞానమున్నది. ప్రస్తుత సన్నివేశమున మార్పును తీసికొని వచ్చి ఉద్దిష్ట విషయమును బొందవలెనను యత్నము స్వాభావికముగా నిచట కలదు. విషయజ్ఞానము సంచారి భావమును మేల్కొలిపి ప్రయత్నమునకు దారితీయుచున్నది. ఇట్లు అంతరంగిక చైతన్యమీ ప్రవృత్తుల ద్వారా బహిర్గతమై వ్యక్తమగుచున్నది. అనగా స్థాయిభావములను సంవిద్రూపములుగా చెప్పవచ్చును. కావుననే స్థాయి యను చిత్తవృత్తి మాత్రమున పొదుగబడి కూర్చబడినవి సంచారిభావములని అభినవుడనినాడు. స్థాయిసహితముగా సంచారిభావము స్థితంతియు కాదు. క్రియ యను భావమనేక కారణముల ద్వారా గలదు. ఈ క్రియయొక్క స్వరూప స్వభావములు తన్మూలభూతమగు స్థాయిద్వారానే తెలియబడగలవు. స్థాయిభావము స్థావరముగా నుండునదగుటచే సంచార్యాదులలో ననువృత్తముగా నుండును, సంచారిభావముల నిందుచే నస్థాయి యనివారు.

మనస్సున స్థావరముగా, నిరాకారహితములై యుండు అంతరిక స్థాయిభావములు ప్రమాతృ ప్రమేయ సంబంధము ననుసరించి స్థాయిభావము లభివ్యక్తములగును. ఉద్దిష్ట ప్రమేయమును చేయుకొనుటలో స్థాయిభావమే వ్యాపృతమగుటచే నిరుకొనుట సహజమైన వృత్తితో వచ్చునదగుచున్నది. విశిష్ట వస్తువులను సమీపించుట, పరిశీలించుట, పరీక్షించుట, తెలిసికొనుట అనునవి వృత్తిగలో వచ్చు విశిష్టప్రవృత్తులు. కావున విశిష్టవస్తువు గమనింపబడగా సంచారి భావోద్రేకము కలుగును, అప్పుడు విషయప్రాప్తికై మన మొనర్చు ఉచితయత్నమే స్థాయిభావము. ఇచ్ఛాజ్ఞానానందములే స్థాయిభావములు. అంతరితములై యుండుటచే వీటి సముదాయమే స్థాయి యగుచున్నది. వీటిలోని ఒక్కొక ఒక్కొకల నాధారముగా తీసికొని స్థాయిభావములో భేదములు వచ్చుచున్నవి. విషయప్రతిక్రియను సంచారి భావోద్రేకము అను వాటితో పాటు సంచారి భావముయొక్క బహిః స్వరూపమును సాత్త్విక భావములతో వ్యక్తమగునది స్థాయిభావము.

ఉదాహరణకు జుగుప్స యను స్థాయిభావము తీసికొందము. దీనిలో జుగుప్స యను సంచారి భావము కూడా కలదు. దుర్గంధ, రుధిర, మాంస, మేదస్సుల వాంతిరసము గ్రహించి, కృమికీటాద్యుద్దీపనములతో విది సంచలితమగును. అప్పుడు మోహము, అపస్మారము, ఆవేగము, వ్యాధి మొదలుగాగల భావ్యసన్నివేశములతో సంచారిభావము వ్యక్తమగుచున్నది. నిష్ఠీవనము, ఆస్యవలనము, నేత్రసంకోచనము మొదలగు కృత్యముల ద్వారా ప్రవృత్తి కన్పించును. ఈ కృత్యము లన్నియు సంచారిభావము నాధారముగా చేసికొని వచ్చుటచే స్థాయిభావము సంచారిభావముచే వ్యక్తీకరింపబడుచున్నదని యనవలెను. అనగా నొక్కొక్క స్థాయిభావములో తత్తద్విశిష్ట సంచారిభావము గలదని భావము. స్థాయిసంచలనమున సంచారిభావము ధ్యాయమానమగును. విద్యుద్దు త్కృమని మెరుపువలె స్థాయిమాత్ర మగ్నమగు కవబడుచు, మాయమగుచు, స్థాయిభావమునకు వైచిత్ర్యము నాపాదించునవి సంచారిభావములు.

స్థాయిభావమొక చిత్తవృత్తి. కాని చిత్తవృత్తి ఎక్కువ కాలము మార్పులేకుండా ఉండజాలదు. వ్యక్తియొక్క మనస్సు ద్వారా చైతన్యమునుండి ఆవిర్భవించు స్థాయిభావము తిరోహితమగునప్పుడు కొన్ని వాసనల నుంచిపోవును. చిత్తవృత్తి బయలుదేగనప్పుడు సంచారిభావము లనేకము లుత్పన్నములైనను, అవి స్థాయిని నశింపజేయజాలవు. ఉప్పు అన్ని పదార్థముల తన రుచిలోనికి మగిలింపజేయునట్లు, సంచారిభావములను తనలోనికి మలినింపజేయజాలునది స్థాయిభావమని దశరూపకకారుడనెను. సంచారిభావములు స్థాయికి విరుద్ధములైనను, అవిరుద్ధములైనను, స్థాయిని తిరోగమింపజేయలేవు. చిరకాలము చిత్తమున నిలచి, అనుబంధములతో అంకురములను పెంపొందించుచు, రసత్వమును పొందునవి స్థాయిభావములని సరస్వతీకంఠాభరణకారుడు గూడ చెప్పెను. ప్రజలకు రాజునకు గల సంబంధమెట్టిదో, శిష్యులకు గురువునకుగల సంబంధమెట్టిదో, అట్టి సంబంధమే సంచార్యాది భావములకు స్థాయిభావమునకు గలదని భరతుడనెను. ఈ స్థాయిభావమే రసముగా పరిణమించునది.

స్థాయిభావము సంచారిభావ మగుట, సంచారిభావము స్థాయిగా పరిణమించుట, కల్పించుటచే స్థాయిసంచారిభావములకు వైలక్షణ్యము నాపాదించుట దుర్ఘటమని కొందరు విమర్శకు లనినారు. సంచారిభావస్వరూపమును విమర్శించుచు ఈ విషయమును తెల్పితిమి. ఇచట విచారింపవలసిన విషయ మింకొకటి గలదు. రుద్రట, లొల్లట, నమిసాధు, భోజాదులు సంచారిభావములుగూడ రసములుగా పరిణమించగలవని సిద్ధాంతించినారు. ఈ విమర్శకుల ననుసరించినచో సాత్త్వికభావములు, విభావానుభావములు గూడ స్థాయిభావములు కాగలవని చెప్పవలసి యుండును.

విభావములు రెండు రకములుగా నున్నవి. మొదటిది ఆలంబన విభావము. రసమును ఆవిర్భవింప జేయు వ్యక్తిగాని, విషయముగాని ఆలంబనవిభావ మగును. ఈ విభావము చిత్తవృత్తి కాదు. రెండవది ఉద్దీపనవిభావము. పరిసరములలో భావము నుద్దీపింప జేయు సన్నివేశ ముద్దీపన విభావము. ఇది కూడ చిత్తవృత్తి కాదు. చిత్తవృత్తి కానిది స్థాయిభావము కాజాలదు. అనగా విభావములు స్థాయిభావములు కాజాలవు.

సంచారిభావములను మన మనుభవించునపుడు బాహ్యముగా శరీరమున కన్పించు చలనములు సాత్త్విక భావములు. సంచారిభావ జనితములు. చిత్తవృత్తి రసముగా పరిణమించుటకు సంచారిభావ సహాయము నపేక్షించును. కాని సాత్త్వికభావములు సంచారిభావములవలన జనించుచుండుటచే వీటిని స్థాయిభావములుగా స్వీకరింప వీలులేదు. సాత్త్విక భావ మనుభావమాయి యుండుటచే అనుభావాదులతో సంబంధమును స్వతంత్రించి గ్రహించలేరు. కావున ముఖముఖాకృతి విభావములు, బాహ్యాదిబాహ్యానుభావములు స్థాయిభావములు కావని నిశ్చయింపవలెను. స్థాయి సంచారిభావముల కతి సన్నిహిత సంబంధ ముండుటచే లోకవాని ప్రవృత్తిని మరియొకటి గ్రహించుటకుదభిన్నముగా కల్పించవచ్చును. బాహ్యాను భావములద్వారా సంచారి భావములు వ్యక్తమగుటచే, బాహ్యానుభావములు లేనప్పుడు సంచారిభావము లేర్పడునని భావించవలెను. ఈ బాహ్యానుభావములద్వారా అంతర్లీనముగానున్న సంచారిభావ స్వరూప మవగతమగును. కావున స్థాయిభావము, సంచారిభావము, బాహ్యానుభావము సాత్త్విక భావము అనుమూటికి సన్నిహితమైన అవోర్ధక్క సంబంధము కలదని సిద్ధాంతము.

విభావానుభావ వ్యభిచారి సంయోగమున రసము నిష్పన్నమగునని భరతసూత్రమున స్థాయిభావము కన్పించదు. పైగా రతిహాసాది స్థాయి భావములను చెప్పు సందర్భమున స్థాయిభావము లెన్ని గలవో వాటి సంఖ్యనుగూడ భరతుడు చెప్పలేదు. స్థాయి భావము లసంఖ్యాకములగుటచేతను, ప్రతి ప్రవృత్తిని ఏదో ఒక స్థాయిభావముతో సమన్వయపరుపవలెను గనుకను, సంఖ్యానిర్ణయ మిచట గావింపబడలేదని అభినవునికన్న ప్రాచీనులైన సాహిత్యసమీక్షకులు వ్యాఖ్యానించిరి. సహృదయావర్జకత్వ ప్రాచుర్యము వలన, పార్షద ప్రసిద్ధిననుసరించి, ఎనిమిది స్థాయిభావములే చెప్పబడినవి గాని ఇవి అసంఖ్యాకములని లొల్లటాదుల అభిప్రాయము. మనస్తత్త్వ శాస్త్రవేత్తలు గణించిన నూరేండ్లలో అనేక స్థాయిభావములను లెక్కించియున్నారు. వీరి లెక్కలో వేటాడుట, తినుట, జీర్ణించుకొనుట గూడ స్థాయిభావములైనవి. కాని ఇవి అహారాన్వేషణరూపమగు మృగయాభావములోనివే గాని వేరు గాదు. స్థాయిభావము చిత్తవృత్తియగుటచే శారీరకవృత్తులను, ఇంద్రియవ్యాపారములను స్థాయిభావము లనరాదు.

శాస్త్రజ్ఞులు, సాహిత్యసమీక్షకులు అనేక స్థాయిభావములను గూర్చి పలికినారు. వీటిలో కొన్ని సాహిత్యమున ఉపకరించునవో విచారింపవలసి యున్నది. ప్రధానాలంకారిక సంప్రదాయము ననుసరించి రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము అను ఎనిమిది స్థాయిభావములే గలవు. ఈ ఎనిమిదింటి తోబాటు వాత్సల్యము, స్నేహము, ఆసక్తి, సంతోషము, అరతి, గర్వ, మృగయా, ఆశ, స్పృహా, క్రీడనకము, మాయ, శ్రద్ధ, భక్తి అను స్థాయిభావములను కొందరు గ్రహించిరి. మరికొందరు శాంతము, ప్రవాసము, నిద్ర, నిర్మాణము మొదలగు వానిని గూడ చెప్పినారు. ఈ ఇరువదిరెండింటిని వర్గీకరించి, వీటిలో కొన్ని స్థాయిభావములు కాగలవో నిశ్చయింపవలసియున్నది. స్థాయిభావముల సంఖ

లీనముగా విశిష్టమగు సంచారిభావము స్పష్టముగా సుంపబడలేదని జ్ఞప్తియందుంచుకొని, తద్విలక్షణము లైనవి స్థాయిభావములు కావాలని తేల్చవలెను.

స్పృహా జనకము భావ మాహారవిషయక ప్రవృత్తిలోనిది. ఈరెండును, ఆత్మరక్షణ, వంశ వృద్ధియును ప్రాథమిక ప్రవృత్తులలో అంతర్లీనములై యున్నవి పైగా భయక్రోధాదులద్వారా స్పృహ జనించును స్పృహా, మృగయా భావములద్వారా ఆత్మజీవిత కాముక అభివ్యక్తమగుచున్నది సంతాన విషయక ప్రవృత్తిలోను, పిల్లలను రక్షించుప్రవృత్తి లోను ఇవి ముఖ్యాంగములు ఈ ప్రవృత్తులద్వారా గృహాది నిర్మాణము జరుగుచున్నది కాగా పైన చెప్పబడినభావము లన్నియు రతియను స్థాయిభావ మున అంతర్లీనములైయున్నవని నిశ్చయించవచ్చును వాత్సల్య, స్నేహాది సుకుమార భావములు కూడ రతి స్థాయిభావరూపములే యగుచున్నవి

ఆక్రోశమున కన్పించు నిస్సహాయిత శోకము లోనిఅంగము ఇది క్రోధ, భయములద్వారా నిష్పన్న మగును శోకముద్వారా జనించు ఆర్ద్రానుభూతి వలన శోకాతిగను పొందిన వ్యక్తులకు సన్నిహిత సంబంధము కలుగుచున్నది కాగా శోకజనితమగు చిత్తసంవాదమున స్నేహ మంత ర్వ్యాప్తమగును తద్ద్వారా సాంఘిక జీవనము పోషింపబడును. అనగా శోకవర్గమునకు చెందినభావములలో శోక మొక్కటే స్థాయిభావముగా కన్పించగలదు

అరతి, సంతోషము అనునవి ప్రతి అనుభూతి లోను అనుస్యూతిముగా వచ్చుచు వేదనారూపమున నున్నవి యగుటచే వీటిని స్థాయిభావము లనరాదు ఆశ, అనాదరణ, నిర్మాణాది భావము లుత్సాహ స్థాయిభావము నాశ్రయించుకొని యుండునవి భౌతిక పరిస్థితులవలన, వాతావరణము వలన ఉత్పన్నము లగు స్థితులగుటచే విశ్రాంతి, నిద్ర, ప్రవాసము అనునవి స్థాయిభావములు కావు శోచము, అసహ్యము అను నవి మనస్సు ఉద్దేశించు స్థితులే గాని చిత్తవృత్తి రూపములు కావు ఇట్లే ఇచ్ఛాశక్తిలోని దోషము నాశ్రయించుకొని బయలుదేరునది నస్తభావము

అస్వార్థమునకు సాధనగా గాక, నిరుపేక్ష భావములో ననుభవింపబడు నిర్మాణ వృత్తి స్థాయి భావమే యగునని అలెగ్జాండర్ నిర్వచించినాడు

కాని రసప్రపంచమున అనుభూయమానములగు భావ ముల కన్నిటికి ఈ లక్షణము వర్తింపగలుగు గనుక ఈ వాక్యమును స్థాయిశబ్ద నిర్వచనముగా గ్రహించ వీలు లేదు జ్ఞానము, భావన అనునవి స్వేచ్ఛగా విహరిం చగా వచ్చు స్థితులు నిర్మాణము, మృగయ, శ్రద్ధ, భక్తి యనునవి అనగా ఇవి స్థాయిభావములు కావు

భక్తి వలన గాని, వాత్సల్యము వలన గాని, జనించు ప్రియతరాభ్యాసమగు ప్రీతిస్థాయి భావము కావాలను ప్రేయస్ అనునది భావము కావ్యమందలి గుణము మాత్రమే అని ఉద్భటు డనినాడు సంచారి భావజనితములై, అత్యంతము విలువగల స్థితులగు స్నేహ, వాత్సల్యములు చిత్తవృత్తులవలన ఉద్భవిం చునవే గాని స్థాయిభావములు కావు స్నేహస్థాయి ఆర్ద్రరతి యని చెప్ప సమీక్షకులు రత్యుత్సాహములలో ఆర్ద్రరతి అంతర్భూతమనియరచుచున్నారు స్నేహము, భక్తి, వాత్సల్యము అనునవి రతియొక్క విశేష రూప ములని హేమచంద్రుడు గూడ వచించినాడు.

ప్రాణుల జీవితములో రతిస్థాయిభావ మతి ముఖ్యమైనది నర్త్రప్రవృత్తి, జ్ఞానవికాసము ఈ స్థాయిభావమునుండియే బయలుదేరుచున్నవని మెక్డూ గల్ యొక్క సిద్ధాంతము పాలు కుడుచుట, ఆహార మును తెచ్చుట, ఇంటిని కట్టుట, శిశువును రక్షిం చుట, శత్రువుల నెదుర్కొనుట మొదలగు క్రియ లన్నియు రతిద్వారా వచ్చునవి ప్రేయస్, వాత్స ల్యములు గూడ రతినుండియే వచ్చుచున్నవి శిశువు యొక్క ఆక్రందనము మాతృత్వమును, పితృత్వమును అభివ్యక్తము చేయగల్గుచున్నది అనగా రతిస్థాయి భావ మనేక భావములకు ప్రధాన కారణముగా కన్పిం చుచున్నది

రతిని సాంప్రయోగికి ప్రీతి, మైత్రి, సౌహా ర్దము, భావము అని నాల్గు విధములుగా కవికర్ణపూర గోస్వామి విభజించినాడు సాంప్రయోగిక ప్రీతి యనునది సంభోగాత్మకమగు ప్రవృత్తి. దీనిని పశు పక్ష్యాదులలో నైన స్థాయిభావముగా గ్రహించినను, మానవస్థితియం దిది రతిలోని అంతర్భావముగనే కన్పించుచున్నది భక్తిశ్రద్ధలలో జ్ఞానము, భావన, ఉత్సాహము కలవు ఈ మూడును రసప్రతీతిలో విశే షముగా కన్పించుటచే కోటితో కూడిన భక్తిశ్రద్ధలను స్థాయిభావములుగా గ్రహింపవీలులేదు. స్మృతి,

మతి, ధృతి, ఉత్సాహములతో సంకలితములైన భక్తి శ్రద్ధలు శాంతరసమునొక్క అంగము లగుటచే వీటికి స్థాయిత్వము లేదని అభినవుడు సిద్ధాంతించినాడు ప్రీతి భక్త్యాదిభావములు, శృంగారహాస్యాది రసములు హర్షోత్సాహములలో నంతర్భూతము లగుచున్నవని దశరూపకకారుడు వచించినాడు. సమాన స్థితిగతు లలోనున్న వారల మధ్య పరస్పరముగాగల రతిని స్నేహమని, అనుత్తమున ఉత్తమునియందు గల రతి ప్రపత్తిని భక్తియని, ఉత్తమున కనుత్తమునియందుగల రతిని వాత్సల్యమని హేమచంద్రుడు ప్రపంచించినాడు

కోపమువలన సంభవించు బాహ్యానుభావములలో క్రోధస్థాయి భావము కలదు ఈ క్రోధము స్థాయిభావము, సంచారిభావముకూడ నగుటచే దీని స్వరూపమును నిర్ణయించుట కష్టము స్థాయిభావము యొక్క స్వాభావికప్రవృత్తికి ఆటంకములు కలుగగా ఉద్దిష్టార్థ విషయప్రాప్తి దుర్లభమైనట్లు కల్పించినపుడు ఉత్పన్నమగు క్రోధమును స్థాయిభావముగా గ్రహించవలెను ఆటంకము, అంతరాయములను పారద్రోలుటకు చేయబడు యత్నము, అనువాని ద్వారా నభివ్యక్తము ప్రవృత్తిలో క్రోధము ప్రధానమైనది ఇచట విషయముకన్న ప్రవృత్తియే ముఖ్యమగుచున్నది ఆటంకమున భయము, యత్నమున ఉత్సాహము వచ్చుచున్నవి భయముద్వారా భయానకము, ఉత్సాహముద్వారా వీరము సిద్ధించగలవు వీరభయానకములు క్రోధము నాశ్రయించుకొని వచ్చుటచే వీటికి రౌద్రము మూలభూతమగుచున్నది అనగా ఉత్సాహ, భయ, క్రోధములకతి సన్నిహితసంబంధము కలదని భావము పరుగెత్తుట, పారిపోవుట, మీదకు దుముకుట, స్తబ్ధముగా నుండుట, వణకుచు కూలిపోవుట, మొదలగునవి భయవర్గమునకు చెందినవి ప్రీతితో సంకలితమైనది క్రోధము ఉద్దిష్టార్థమును సాధించుటకు క్రోధము వ్యాపృతమగుచుండగా, విషయమునుండి వెనుకకు మరలుట జుగుప్సలో గలదు జాగరూకత, కంపము, తొట్రుపాటు మొదలగునవి ఉభయత్ర కలవు. వీటి నన్నిటిని ప్రత్యేక ప్రత్యేకముగా స్థాయిభావములన వీలులేదు

క్రోధ, భయ, జుగుప్సలద్వారా శోకము రాగలదు ఈ శోకము బీభత్సమునకు సంబంధించినదగుటచే జుగుప్సావహమగును కాని భయమునుగొల్పు వస్తువు మిక్కిలి ఆకర్షణీయమైన విస్మయమురేకెత్తును విస్మయము సర్వసాధారణమై అన్ని ప్రవృత్తులలోను కల్పించును అన్ని ప్రవృత్తులకు కొంతవరకాధారభూతమైనది విస్మయము అసమగ్రప్రతీతినిగాని, జ్ఞానమునుగాని ఆధారము చేసికొని బయలుదేరు విస్మయముద్వారా విషయముగాని, సన్నివేశముగాని అతి స్పష్టమగును పరిశీలన, అన్వేషణ, జ్ఞానము మొదలగువానికి విస్మయ మాధారభూతము. దీనిని చేతోవిస్ఫార మందురు ఈ విస్మయమును చిత్తవికాస విస్తృతులు కల్పించగలవు అనగా అనేక స్థాయిభావములకు విస్మయమే పట్టుకొమ్మవంటిది విస్మయముద్వారా ప్రధానముగా స్వీయవిషయకమగు జుగుప్స కలుగును కావున ప్రేమకాది శబ్దములచే తెలియజేయు వినయవిధేయతలు స్వతంత్రముగా స్థాయిభావములు కాజాలవు విస్మయ మనేక ప్రవృత్తుల కాశ్రయమైనను, కొన్ని ప్రవృత్తులలో విస్మయమే ప్రధానముగా గోచరించును లోకోత్తరవిషయములను దర్శించునపుడు విస్మయ మొక్కటే కన్పించగలదు

కావున రతి, క్రోధము, భయము, ఉత్సాహము, విస్మయము అనునవి మానవజీవితములో నతి ముఖ్యమైన స్థాయిభావములు కరుణాంతర్గతమగు శోకముతోను, హాసముతోను కలసి ఈ మొత్తము ఏడు స్థాయిభావములు పురుషార్థ (*Values*) సాధకము లగుచున్నవి మానవజీవితమున కరుణాంతర్గతమగు శోకము స్థాయిభావముగాను, సంచారిభావముగాను కూడ అనుభూయమానమగుచున్నది బాధలోగాని, దుఃఖములో గాని ఉన్నవారియెడల మన మనుభవించు కరుణ లాలిత్యముతో గూడి చిత్తమును ద్రవింపజేయువది విపత్తులోగల విషయముపై ప్రేమయున్నచో చిత్తము ద్రవించును అనగా కరుణ రతి స్నేహవాత్సల్యాదులతో సంకలితమై యున్నది చిత్తద్రవీకరణ ద్వారా ఇతరుల బాధను భవారూపమున అనుభవించుటయే హాస్యమందలి ప్రధాన విషయము కాగా రతి హాస శోకములకు పరస్పరము సన్నిహిత సంబంధము కలదని, మిగిలినవాటికి ఇట్టి అన్యోన్య సంబంధమే కలదని సిద్ధమగుచున్నది.

ఈవిధముగా నతి ముఖ్యమైన స్థాయిభావములు జుగుప్సతో కలసి ఎనిమిది యగుచున్నవి ఇది కేవ

లను చిత్తవృత్తులు మనస్సునకు అనుకూలవిషయముపై కలుగు ప్రసన్నాయితము రతి. వైక్లబ్యమను చిత్తవృత్తివిశేషము శోకము. చేత వికాసము కోసము ప్రజ్వలన మనబడు చిత్తవృత్తియే క్రోధము. ఔన్నత్యాత్మక్య చిత్తవృత్తి ఉత్సాహ మందురు. భయమున చిత్తవైక్లబ్యము కలదు గనుక భయశోకములను రెండు భిన్న స్థాయిభావములుగా పరిగణింప నవసరములేదు. చిత్తవిస్ఫార రూపమగు విస్మయము జుగుప్సాగులకు హేతువు కాగా అదే ప్రధాన స్థాయిభావము లగుచున్నవి.

ఈ స్థాయిభావముల కన్యోన్య సంబంధ మతి సన్నిహితము. ఒకే విషయమున అనేక చిత్తవృత్తులు పైకి ఉబుకవచ్చును. ఒకే విషయము నుద్దేశించి అనేక మందికి ఒకే ఒక విభిన్నమైన చిత్తవృత్తి కలుగవచ్చును. ప్రతిస్థాయిభావము ప్రవృత్తి పరమగుటకు తత్తద్విశేషములు, ఉద్దీపనములు గలవు. ఇతరుల చిత్తవృత్తుల వలన కలుగు బాహ్యానుభావములను చూచినపుడుగూడ ఈ స్థాయిభావములు పైకి రాగలవు. భయజనితమగు శోకమును వినగానే అదే వర్గమునకు చెందిన ఇతర వ్యక్తులకు దుఃఖానుభూతి కల్గుట సహజము. అట్టిసమయములలో మనస్సు కంపించి, ఇతరులమనస్సులతో ననన్యత్వమును పొందుచున్నది. దీనినే చిత్తసంవాద రూపమగు ఆర్ద్రత యందురు. ఈ సంవాదమే మానవ ద్రవీకరణ మానసికము. దీనివలన ఒకేవర్గమునకు చెందిన వ్యక్తులకందరకు లోకోత్తరమైన మనస్సు, మనః ప్రవృత్తులు కలసి నిప్పవిలసుచున్నది. ఈ తాదాత్మ్యము లేనిచో స్థాయిభావములకు ప్రవృత్తి ఉండ జాలదు. అనగా స్థాయిభావములన్నియూ నొకరియొక్క మూలశక్తినుండి ఆవిర్భవించుచు, ఆ శక్తియొక్క రూపములుగా బహిర్గతములగు చిత్తవృత్తులనిభావము. కావున నొకరియొక్క ప్రవృత్తిలో అనేక స్థాయిభావములు కల్పించబడియున్నది. కాని వీటిలో నొక్క స్థాయిభావమే ప్రధానమగును. మిగిలినవి దానికి అంగములు కాగలవు. ఒక స్థాయిభావమున కంగములగు మిగిలినస్థాయిభావములు సంచారిభావములవలె ప్రవర్తించగలవు. అనగా సందర్భవశమున నొకరియొక్క చిత్తవృత్తి స్థాయిభావముగాను, సంచారిభావముగాను కూడా కావచ్చును. సజాతీయ విజాతీయ భావాంతరములచే తిరస్కృతము గాక ఉపనిబద్ధమానములగు రత్యాదులే స్థాయిభావములని ఆలంకారికులు నిర్వచించియున్నారు.

క్రోధ, శోక, భయ, జుగుప్సలు తమంతటి తామే పరిని ఉత్పన్నములు చేయజాలవనియగుటచే నీశక్తి వీనికి సంక్రమించునదేగాని, వీటినుండి ఉత్పన్నమగునది కాదని స్పష్టము. రతి, ఉత్సాహ, విస్మయములతో సర్వదా మెలగునది హాసము. ఇవి ప్రతిప్రవృత్తిలోను కల్పించు భావములు. చిత్తద్రవీకరణశక్తిచో నీనాల్గుభావములు అర్థరహితములు, ప్రయోజనరహితములు కాగలవు. స్థాయిభావజనితములగు అనుభావము లవగతములైనప్పుడే చిత్తసంవాదము కలుగును. సాంఘికజీవనమున కీచిత్తసంవాద రూపమగు అవగతి లేక వ్యంజన ప్రముఖాధారము. తద్వారా వ్యక్తులందరు అన్యోన్యసంబంధమును కలిగి మెలగుదురు. ప్రమాతృప్రమేయములకు సమగ్రమగు అనన్యత్వము సిద్ధించుటయే ఈ చిత్తసంవాదము. ఈ అనన్యత్వము రసప్రతీతిలో నతిప్రధానమైనది. కాగా చిత్తసంవాదమున కే యే భావము లుపకరించుచున్నవో వాటినే సాహిత్యమున మనము ప్రధానముగా స్వీకరించవలెను. అప్రధానమగు వస్తువు ఎవనిచిత్తమునకును విశ్రాంతి నీయజాలదు. అప్రధానమగు భావము ప్రధానభావమున పర్యవసితమగుచు, అన్యముఖప్రేక్షియగుచున్నది. ప్రధానమై, ఇతర భావముల కంగముగాక, స్వయం సిద్ధమై, సమగ్రమై, సంపూర్ణమైనది స్థాయిభావము. పరిసరములలో కలుగు మార్పులకు లోబడక, చిత్తవృత్త్యాత్మకములైనవి స్థాయిభావములు. ఈచిత్తవృత్తులు ప్రవృత్తికి దోహదము లొసగుచున్నను ముఖ్యముగా నివి జ్ఞానాకారములే యని చెప్పవలెను.

కాలవశమున స్థాయిభావములలో విశిష్టములగు మార్పులు వచ్చుచున్నవి. పశుపక్ష్యాదులలో కన్పించు స్థాయిభావములు క్లిష్టములు కావు. మానవులలో నివి యనేకభావములతో క్లిష్టములై కన్పించుటచే వీనిని వివిధ భావములలోనికి విశ్లేషించవచ్చును. ఈ భావము లన్నియు ఉద్దిష్టార్థప్రాప్తికి గాని, విషయమునుండి పరాఙ్ముఖమగుటకు గాని వ్యాపృతము లగుచున్నవి. అనగా ఇచ్ఛాశ్రయించుకొని ప్రవృత్తిగులగు నీ భావములు, ఉద్దిష్టార్థప్రాప్తితో ప్రయోజనవంతము లగును. ప్రవృత్తికి హేతుభూతములగు కోరికలద్వారా ప్రవృత్తి సుఖదుఃఖముల నొసగజాలుచున్నది. కాని ప్రతిప్రవృత్తిలోను సుఖదుఃఖములు సంవలితములైయుండు నని మరువరాదు. స్థాయిభావముల నాధారముగా చేసికొనియున్న రసప్రతీతి మానసికానుభూతిని, ఆత్మానుభూతిని ఇచ్చునది. చిత్తవృత్త్యాత్మకమైదగుటచే స్థాయిభావ ప్రవృత్తి ప్రయోజన సహితము. ఈ ప్రయోజన మితర భావములద్వారా, ప్రవృత్తుల ద్వారా, అవగతి మగుచున్నది. ఈ అవగతి చైతన్య ప్రతీతి వైగా అవగతి అర్థరహితము కాదు. అర్థము జ్ఞానాకారము అనగా చైతన్యము, జ్ఞానము అనునవి పర్యాయపదములు. అనుభూతిలో విషయములన్నియు జ్ఞానమున లీనమగుచున్నవి. ఈ అనుభూతి చేతనుండు వ్యక్తికి కలుగునది.

# తెప్ప తిరునాళ్లు

★

శ్రీ కంమకూరి రామభద్రరావు

రండమ్మరండి! రవలసొమ్ములతోడ,
తరలి రారండి! తెప్పతిరునాళ్లు,
శ్రీనృసింహస్వామి శ్రీదేవితో గూడి
కార్తీక జ్యోత్స్నలో కడలి కెరటాలపైన
ఉయ్యాలలూగగా ఊరేగివచ్చేను  రం॥

వెన్నెలంతా నింగి వలిగొడుగు విప్పింది
హరితాంకురాలతో అవని పులకించింది
నేయిదివ్వెలతోడ నేంచేయుసామికై
హాయిగా సాగు సన్నాయిమేళము రండి.  రం॥

వెండితళుకుల చిర వ్రేలాడుకుచ్చిళ్లు-
గొప్పింటి ఒయ్యారి గోదావరీగంగ
ఆదరికి ఈదరికి ఒదుగుతూ తానచ్చి
నిజనాథుసజ్జనే సిలిచి మ్రొక్కింది  రం।

సాగరుడు చేపట్టి చదలంటగా లేచి
పొంగవల్లు ప్రోక్కుతూ పాల్కుసలితానమై
గోదావరీదేవి కొంగు కొంగూ కలిపి
స్వామికెదురుగవచ్చి స్వాగతంబిచ్చేను  రం॥

పల్లెపడుచులు బిగువు పగలబడి నవ్వగా
తెల్లపూదెప్పపై తేలిపోవుసామి
జేజేలు నల్దిశలు చేరి మార్మ్రోగేను
శ్రీరసాగరశయను సేవింప రారండి  రం।

సాగరుడు శయనమై సంతరించెడు వేళ
మేళాలు తాళాలు మినుబాణసంచాలు
కోలాహలమ్ముగా కొలువుదీర్చెనుసామి
అభయహస్తము నెత్తి ఆశీర్వదించేను  రం॥



# యజ్ఞఫలము

## భాసమహాకవి సంస్కృతనాటకమునకు ఆంధ్రీకరణము

శ్రీ బులుసు వేంకటేశ్వరులు

(గత సంచిక తరువాయి)

### విష్కంభము

(సరయూ తీరమున క్రీడించు నిరువురు గంధర్వులు ప్రవేశింతురు)

చిత్రకేతువు: చిత్రపదా! నీవీ జలముల స్నానము చేయు నుత్సాహమున నీ కర్తవ్యమును మఱచితివి. మన మిట కేల వచ్చితిమో తెలియునా?

చిత్రపదుడు: తెలియకేమి యంతయు నెఱుగుదును. రావణుడు రామునకే మైన నష్టము చేయుటకు నిగూఢరూప చ్ఛాయతో నయోధ్యా ప్రాసాద సమీపమున దిరుగుచున్నాడు. మహేంద్రుని యాజ్ఞను రాముని సంరక్షింప మనమిద్దరము నిటకు వచ్చినారము. కాని

హిమగిరి నీరసౌఖ్య మొక
యింతయు సాటికి రాదు, గాత్ర
మోత్తమమగు గంగ నీరు మఱి
తక్కువ దివ్యజలంబు లింతయున్
సమములు కావు చూడగ న
వంతము గా సరయూ జలంబుతో,
సముచిత మిందు స్నానము, మఱి
శైత్యము, పింగళాల దీనిదిన్.

చిత్రకే: హిమాద్రిక ప్రదేశమునుండియే మన మిపుడు వచ్చినను నిది నిదాఘకాల మగుటచే స్నానము సుఖావహమే కాని, స్వామి నియోగము మఱచిపో గూడదు గదా!

చిత్రప: ఔను కాని,

నిఖిల ఋతువుల బహుళరమణీయ మగుచు
సకల దేవర్షి మనుజ ప్రశంసితంబు
నయిన సరయూజలంబు పాపౌఘ మడచు
గ్రీష్మ శిశిరర్తువుల నను క్షేమ మొసగు

ఏమైనను నేను స్వామి నియోగము మఱవలేదు. అపరాహ్ణమునకు బూర్వమే రావణు డెట్లయోధ్యకు రాగలడు? ప్రత్యక్షమున వచ్చినను నంత త్వరగా రాలేడు. ఇంతకు నింద్రాదులే తమ భార్యలను రక్షించుకొనుటకైనను నాతని ప్రభుత్వ మంగీకరించిరి కదా! ఇక నెవరు రాముని రావణుని బారి నుండి రక్షింపగలరు? అట్లని ప్రభు నియోగ ముపేక్షింతుమని కాదు. కానిమ్ము. గూఢ దేహులమై యీ ప్రాసాదోపవనమున నిరీక్షింతము.

చిత్రకే: అట్లనకుము. రావణుడు దశరథుని కంటె బలవత్తరుడేమైననో? వేల యాతడు గూఢముగా వచ్చును? తన కనిష్టము సంభవింపవచ్చునను భయము చేతనే యాతడు దశరథునకు జడియుచుండె నమ్ముము.

చిత్రప: కాదు కాదు రావణాసు ద్వితీయ బలవంతుడు

చోరులు శిలలును వ్యసనులు
ధీరత్వము గాంచ, రెపుడు భీతిప్రగుణ
వ్యాపారులు, ప్రత్యక్షముగా
క్రూరములగు పనులు చేయగోరరు మనుజుల్

చిత్రకే: ఏమైనను గలదు కదా! యీ యనిష్ట ప్రతీకారోపాయము

చిత్రప: సరే రమ్ము పోదము (నిష్క్రమింతురు)

ఇది విష్కంభము

### తృతీయాంకము

రావ: (ఆకాశమార్గమున రావణుడు ప్రవేశించును)

పుట్టినాడ బులస్త్యర్షి పౌత్రకులము
నందు వందితి శివు గొల్చి యమితబలము
సురలసేవల గొంటి, దనుజులు భృత్య
లపజయ మెఱుంగనే రావణాఖ్యుడ.
అద్వితీయుడ సులబలానంత శౌర్య
ములను దేగియుమాయుడ నలఘుకీర్తి

# తెప్ప తిరునాళ్లు

★

శ్రీ కందుకూరి రామభద్రరావు

రండమ్మ రండి! రమణీసామ్ములతోడ,
సౌరలి రారండి! తెప్పతిరునాళ్లు,
శ్రీనృసింహస్వామి శ్రీదేవితోగూడి
కార్తీక జ్యోత్స్నలో కదలి కెరటములపైన
ఉయ్యాలలూగగా ఊరేగివచ్చేను   రం॥

వెన్నెలంతా నింగి వెలిగొడుగు విప్పింది.
హరితాంకురాలతో అవని పులకించింది
నేయిదివ్వెలతోడ నేఁ చేయుసామికై
హాయిగా సాగు సన్నాయిమేళము రండి   రం॥

వెండితళుకుల చిర వ్రేలాడుకుచ్చిళ్ల-
గొప్పింటి ఒయ్యారి గోదావరీగంగ
అదరికీ ఈదరికి ఒదుగుతూ తానచ్చి
నిజనాథుపజ్జనే నిలిచి మ్రొక్కింది   రం॥

సాగరుడు చేపట్టి చదలంటగా లేచి
సావళ్లు మ్రొక్కుతూ పాల్కడలి తానమై
గోదావరీదేవి కొంగు కొంగూ కలిసి
స్వామికెదురుగవచ్చి స్వాగతంబిచ్చేను   రం॥

పల్లెపడుచుల బిగువు పగలబడి నవ్వగా.
తెల్లపూదెప్పపై తేలిపోవునుసామి
జేజేలు నల్దిశలుచేరి మార్మ్రోగేను
క్షీరసాగరశయను సేవింప రారండి   రం॥

సాగరుడు శయనమై సంతరించెడు వేళ
మేళాలు తాళాలు మినుబాణసంచాలు
కోలాహలమ్ముగా కొలువుదీర్చెనుసామి
అభయహస్తము నెత్తి ఆశీర్వదించేను   రం॥

# యజ్ఞఫలము

### భాసమహాకవి సంస్కృతనాటకమునకు ఆంధ్రీకరణము


### శ్రీ బులుసు వేంకటేశ్వరులు



(గత సంచిక తరువాయి)


విష్కంభము.

(సరయూ తీరమున క్రీడించు నిరువురు గంధర్వులు ప్రవేశింతురు)

చిత్రకేతువు చిత్రపదా! నీ వీ జలముల స్నానము చేయు ముత్సాహమున నీ కర్తవ్యమును మఱచితివి మన మిట కేల వచ్చితిమో తెలియునా?

చిత్రపదుడు తెలియకేమి యంతయు తెలియును రావణుడు రామునకే మైన నష్టము చేయుటకు నిగూఢరూప చ్ఛాయతో నయోధ్యా ప్రాసాద సమీపమున దిరుగుచున్నాడను మహేంద్రుని యాజ్ఞను రాముని సంరక్షింప మనమ య్యవసరమున నచటికి వచ్చినారము కాని

హిమగిరి నీరసౌఖ్య మొక
యింతయు సాటికి రాదు, ఉత్త
మోత్తమమగు గంగ నీరు మఱి
తక్కిన దివ్యజలంబు లింతయున్
సమములు కావు చూడగ న
సంతము గా సరయూ జలంబుతో,
సముచిత మిందు స్నాన, మను
జోద్యము, పాపగజాల దీనినిన్.

చిత్రకే హిమాధిక ప్రదేశమునుండియే మన మిప్పుడు వచ్చినను నిది నిదాఘకాల మగుటచే స్నానము సుఖావహమే కాని, స్వామి నియోగము మఱచిపో గూడదు గదా!

చిత్రప ఔను కాని,

నిఖిల ఋతువుల బహురమణీయ మగుచు
సకల దేవర్షి మనుజ ప్రశంసితంబు
నయిన సరయూజలంబు పాపౌఘ మడచు
గ్రీష్మ శిశిరర్తువుల సమశ్రేష్ఠ మొసగు

ఏమైనను నేను స్వామి నియోగము మఱవలేదు. అపరాహ్ణమునకు బూర్వమే రావణు డెట్లయోధ్యకు రాగలడు? పుష్పకమున వచ్చినను నంత త్వరగా రాలేడు ఇంతకు నింద్రాదులే తమ భార్యలను రక్షించుకొనుటకైనను వాతని ప్రభుత్వ మంగీకరించిరి కదా! ఇక నెవరు రాముని రావణుని బారినుండి రక్షింపగలరు? అట్టి ప్రభు నియోగ ముపేక్షింతుమని కాదు కానిమ్ము గూఢ దేహులమై యీ ప్రాసాదోపవనమున నిరీక్షింతము.

చిత్రకే: అట్లనకుము రావణుడు దశరథుని కంటె బలవత్తరుడేయైనచో నేల యాతడు గూఢముగా వచ్చును? తన కనిష్టము సంభవింపవచ్చునను భయము చేతనే యాతడు దశరథునకు దెలియకుండ వచ్చుట

చిత్రప కాదు. కాదు రావణు డద్వితీయ బలవంతుడు

చోరులు కిసులును వ్యసనులు
భీరుత్వము గాంచ, రిపుడు భీతిప్రదుల
న్వారలు, ప్రత్యక్షముగా
క్రూరములగు పనులు చేయగోరరు మనుజుల్.

చిత్రకే ఏమైనను గలదు కదా! యీ యనిష్ట ప్రతీకారోపాయము

చిత్రప సరే రమ్ము పోదము (నిష్క్రమింతురు)

ఇది విష్కంభము

## తృతీయాంకము

రావ (ఆకాశమార్గమున రావణుడు ప్రవేశించును)

పుట్టినాడ బులస్త్యర్షి పూతకులము
నందు నందితి శివు గొల్చి యమితబలము
సురలపేరల గొంటి, నసురులు భృత్యులై
లపజయ మెఱుంగ నే రావణాసురుండ
అద్వితీయుడ సులభలాకాంతకార్య
ములను చేగియుహాసుడ నలఘుకీర్తి

సకలభువనంబులందు నసమానమాన
వీర్యమహితుండు మఱొకండు వెలయుగలడె?
దశరథావనిపాలు తనయుడంట ప్రసిద్ధ
రామాభిధానవిభ్రాజితుడట
శస్త్రాస్త్రవిదుడంట సమరంబునందు
సురాసురగణములకైన లీల
గెలువ శక్తుండట తలపశాలుండైన
మత్తమయోధుడై యొప్పునంట
అని జనంబులు చెప్ప విని యాత డెట్టిడో
చూడంగ వచ్చితి జోద్యముగను

అట్టిమర్త్యుడు బలవంతుడైనవాడు
నరులలో పలగలడె యున్నట్టియెడల
నతని జీవింపనిత్తునే యవనిపయిని,
అందుకొరకైనదే మదీయాగమంబు

మంత్ర ప్రభావమున నిగూఢరూపములో నాకాశజల పర్వతతుల్య గతిని జరించు నారథము నెవ్వరును గనజాలరు దీని నిట నుంచి ప్రాసాదమున కేగి చూచెదను

(నిష్క్రమించును)

(అంత విశ్వామిత్రుడు ప్రవేశించును)

విశ్వా
మును శైత్రోచిత తేజమంద బరమా
మోఘాస్త్రసంఘాతముల్
నను నిర్జింపగజాలరెవ్వి విభుడున్
బ్రహ్మత్వమంగాంచనదే
వనికాయాస్త్రము లెల్ల నమ్మెయకు నా
పై నట్టివన్నొప్పిరీ
హంని దేజస్వివి శక్తియుక్తు గననా
నాకొక్క జగంబందునన్
భువనంబెల్ల విహారముల్ సలుపనే
పాల్పొందనే యొక్క జే
పవిదున్ మాదృవశక్తియుక్తు లవి చూ
పం గల్గువా లేడి మా
నవసంఘంబున జృంభితాస్త్రతతిరు
ద్నన్ వశ్యమెవ్వాని క
య్యది యేయన్ మజే తీయ శక్తి తలపో
యన్ గల్గనే యోరికన్?
అతిశయవీరుడున్ దశర
థాత్మజుడున్ రఘురాముడాము ధు
న్నతబలశాలి యయ్యెనను ఘు
నంబునదాంతి గలాడటన్న సం
గతి విని వచ్చిచూడ గన
గా నతనిన్ గని సత్యమేని స
న్నుతముగ శిష్యుగా గొని య
న గ్రహియించెద శస్త్రవిద్యలన్
ధరణీపతి కృతుండు న
శరథుని యాచించి రామచంద్రుని గొని సం
బరమున నాశ్రమపదమున
కరిగి మదీప్సితఫలంబు నందెద నిదపన్

(ముందు చూచి) ఏమి! రావణు డాకాశము నుండి భూమికి దిగుచున్నాడు! నా తిరస్కరిణీ విద్య వలన నిగూఢుడను స్వరసుడు నగు రావణుని గనగంటిని కాని, యాతడు పైవారికి గనరాడు కానిమ్ము. ఆతని తిరస్కరిణీవిద్యను నిగూఢ దేహుడను గన గల్గుచున్నాను ఆత డిట నేమి యకార్య మొనరించునో? నాకాశవలన నిక నాతని యాటలు సాగవు

రావణుడు (ప్రవేశించి) ఏమి! విశ్వామిత్రు డిటకు వచ్చినాడే! ఈతడు బ్రహ్మక్షత్రి తేజో రాశి నాకోరిక నీతడు సాగనీయడు—నేనును దుర్ధర్షుడ నగు రావణుడ నగుటచే సీతను నా కేయనిష్టము చేయ లేదు నానిగూఢరూప మీతడు చూడ శక్తుడు కావున నే నాతని కంటబడకుండ నిగూఢుడనుగనే చరించెదను

విశ్వామిత్ర రావణులు

(ఎవరికి వారే) నేను జూచుచున్నాను కాని యాతడు నన్ను జూచుట లేదు (ముందు చూచి) వసిష్ఠునితో గూడ ఐదుగురు బిటకే విచ్చేయుచున్నారు

(అంత వసిష్ఠుడు నలుగురు కుమారులు ప్రవేశింతురు)

వసి కుమారులారా! దీర్ఘాయుష్మంతులు
కలిసితి రెల్ల విద్యలను గంటిరి
మీరు యథాక్రమంబుగా
మఱపొక యింతలేక శ్రుత
మాత్రముచే గ్రహియించి యాత్మలన్
స్థిరపడునట్లు చేసికొని, చెందను
ధనస్థిత మదురత్వమున్;

పరమ సుఖప్రదంబు లగు శాస్త్రముల
  నిచ్చెడు జ్ఞాన సంపదల్
దీపం బెట్టులు వేలుగు
దీపంబుల వెలుగజేయు తేజము సమమా,
నా పగిదిని నస్మద్వి
ద్యా పరిణతి నా సమానులైతిరి మీరున్
మాదృశ తాపసశ్రీ జన
  మాన్యము శ్రేష్ఠము మీదు వంశ మ
త్యాదృతి శాస్త్ర ధర్మముల
  నంది జగజ్జన సౌఖ్యదాయియై
త్వాదృశ సద్గుణ ప్రచుర
  తన్ వెలుగొందు ననాది నుండియే
తా దృఢ కీర్తి మీకు నగు
  తన్, భువి వర్ధిల రాజ్యలక్ష్మియున్

కుమారులు  భగవానులకు తమకపు  జేరినది మొదలు మాకన్నియు శుభ పరంపరలే యగుచున్నవి ఇందు సంశయము లేదు  ఇపుడు నగర బహిర్భాగమున కేగి మేము నేర్చిన రీతి ధనుర్వేద విద్యాభ్యాసము చేయ కుతూహల పడుచున్నాము తా మనుజ్ఞ యొసగుచో యథేచ్ఛము సాధన చేయుదుము

వసి  నేను పాఠ్యమి కౌన, అనధ్యాయము మీ యిష్టము వచ్చిన చోటికి కేగుడు  నేనవధ్యాయ కరణీయముల నిర్వర్తింతును (నిష్క్రమించును)

రాము  వత్సలారా! మనము పురమునకు దక్షిణముగా బోయి ధనుర్హస్తలాఘవము నేర్చిన రీతి జూపుకొందము

భర  పార్శ్వచరులను పిలువనంపవా?

రాము  వలదు .

నలువుర మున్న వారము, వనంబున
  నేగగ భీతి చెంద వి
న్నలమును గాము, దూరగమనంబును
  జేయము, చేతులందు వి
ల్కులు శరముల్ చెలంగుగదా! గుప్తముగా
  భుజవీర్య విక్రమం
బులు పరికించు కొంట తగు, పొమ్మను
  పార్శ్వచరాళి నిప్పుడే

శత్రు  (తెరవంక జూచి) మనము చెప్పక పోయినను మనగమన మెఱింగి పార్శ్వానుచరులు మన వెంట వెంట వచ్చుచున్నారు

లక్ష్మ  (తెరకెదురై) ఓ పార్శ్వానుచరులారా! మేము ధనుర్లాఘవ మభ్యసించుటకై వెళ్లుచున్నాము మీరు శ్రమపడి రానక్కఱ లేదు మీరు వచ్చిన దారినే వెనకకు బొండు

(అందఱు నడతురు )

రాము  (వెను దిరిగి చూచి) వీరు వెనుక కేగుట లేదు

లక్ష్మ  మీరు వెనుకకు బోనిచో నేను బాణములు వేసి మిమ్ము వెనుకకు బంపుదును (విల్లు ఎక్కుపెట్టును )

రాము  వత్సా! శాంతింపుము వీరు స్నిగ్ధ హృదయులగు నాత్మీయులే దండవార్తులు కారు. (తెర కెదురై) అనుచరులార! మీరు వచ్చినచో నాపై నొట్టే మరలి పొండు

భర : అందఱు వెనుదిరిగి పోయినారు.

(అందఱు మరల నడతురు.)

రాము  ఇంకను నడచి యేమి లాభము? ఇక్కడనే మనశాస్త్రానుకృత నభ్యసింతము. (అందఱు కూర్చుందురు )

శత్రు  (లేచి)

అదిగో పిప్పలవృక్ష మందు
  గల పత్త్రాళికా సమస్తంబు వా
పాదిలో నున్న విహంగ మొక్కటి
  యిదే పాల్పరగా నేగి భి
ద్రదళన్ బొందగఁజేసి తత్క్షణమె
  చేరన్ వచ్చు స్వస్థానము
న్యాది మీ రండఱు కన్గొనుండు
  పరమాహ్లాదంబు రేకెత్తగన్

(బాణము విడచును )

రామ భరతలక్ష్మణులు  సెబాస్  వత్సా సెబాస్

భర  దీర్ఘాయుష్మంతుడు శత్రువిదుడు వగు శత్రుఘ్నుడు చేసినట్లే నే నింకొక వృక్షము శాఖల నట్లే చేసెదను  (బాణము విడచును )

రాము  సెబాస్ వత్సా! సెబాస్  మీ ధనుర్వేద కౌశలము చూచినారము

లక్ష్మ  (విల్లెక్కిడి)

"ఆమూలంబుగ వృక్షమున్ శకల
    చేయం గాంచి యాగ్రమాని సె
న్నొమ్ముక్కల్ పొనరించి పైచి దీలిలంబున్
    జిమ్ము వాయువ్యమ్ము మీ
రా మార్గంబున జూచుచుండు డిది
    వాయవ్యాస్త్రమ్ము పస్వెంట నే
భీమప్రౌఢి నొనర్చి యాపని
    నిమాపించుణ్ విజయస్థానముణ్"

మఱియు, నింకొక బాణంబున—
"చలియించుచున్న మేఘము
నిలుపుదు స్తబ్ధముగా గాన, శిలా సున్నతమౌ
శిలచే నావృతమౌను
జలియింప నొనర్తు దృణము సమమది కాగన్"
(బాణములు విడచును) ఆహా! చూచితిరా!

"వనమున ఒరియించెద పా
గములు పక్షులను భీతి గని గొంచెవులన్
భువలాభువ శరపిర్మన
మున బాణకు జూడు వేగముగ వరిగదిగో"

భరతశత్రుఘ్నులు ఆహా! మహాఘోరమైన బాణక్షేప కౌశల మద్వితీయము

రాము శెబాస్ వత్సా శెబాస

"పార్థకమరెగ్గ నీ ధనువు
    సర్వ సురం సురమానవ కి క
తర్థము భీతిగూర్చని
    నహా! యీ మియ్యది యల్పమాన నే
వర్ధిగుణ పైన వన్నహరంమును
    కీషనివ షి వెటర
యర్థము, మృత్యువే లె
    భయంబది లే దిక నాకు సెన్నదున్"

లక్ష్మణ భరతశత్రుఘ్నులు (బద్ధాంజలులై)
గుణాకరత్వమునను నీవు శ్రేష్ఠుడవే

"ఘనములచేత విద్య నమ
కాలత మాన్యత శ్రేష్ఠులైన స
త్తనయులలోన పెద్దవయి
ధన్యత గాంచితి నీవు చూడగా"

రాము:
"గుణము పరింతు రెల్లరును
గొల్వరు వృద్ధయినంత మాత్రచే
మిణుగురు పుర్వు వృద్ధయిన
పెత్తురు కాంతిని బాలభానునిన్"

భరతలక్ష్మణ శత్రుఘ్నులు:
"నయమున నీతిని గుణమున
వయసున దలపోయ నీవ వరణీయుడవై
ప్రియ మొనరింతువు మాలో"

రాము
ప్రియబంధువు లెపుడు గుణమె వెదకుదురుగదా!"

భరత లక్ష్మణ శత్రుఘ్నులు ఆర్యా! మాధనుర్వేద కౌశలమున జూచి మమ్ము సత్కరించితివి నీ నిపుణతను మేము కనగోరుదుము.

రాము
"జన్మసంస్కార విద్యల సములమైన
మనకు నెట్టుల గుణభేద మెనయు జూడ?

భర
జన్మచేత పలంప సమువి యైన
ముత్తెముల వత్తుపల్లులు పోలునొక్కొ?"

రాము సరే మీరు వినోగింప నేను జూపనను నెట్లు? (తనలో) వత్సల ప్రయోగ నైపుణ్యము జూచియున్నాను నేను వారికంటె నెక్కువ నైపుణ్యము చూపిన వారు చిన్నబుచ్చుకొనవచ్చును (ప్రకాశముగా) వత్సా! శత్రుఘ్నా! నీవు చూపిన ధనుర్వేదకౌశలము నేను జూప యత్నింతును (విల్లెక్కిడును)

విశ్వామిత్ర రావణులు (దూరమున ప్రవేశించి ఎవరికివారే తమలో) ఇతడే రాముడు

"పరమవిశాలమున్ దృఢము
    వక్షము, నున్నత మంసభాగముల్,
సురుచిర మా ముఖాంబుజము
    శోభిత మా నయనద్వయంబు, భీ
కర మరికోటి కెన్న విలు
    కాని తనం బది, దేవదేవుడౌ
హరి యవతార మీత డని
    యంటకు సంశయమున్నె చూడగన్"

నే నీ నిగూఢదేహముతోడనే నా బాణములతో రామబాణములు లక్ష్యమును చేరుటకు బూర్వమే వడుము ఖండించెదను అతడు కోపిష్ఠుడై యేమిచేయునో చూతును. అతని పరాక్రమ మంతయు నపుడు పొడకట్టును.

సింహ మొక్కటియే వనవీధుల నెల్ల
గలచి వైచును గాదె! విక్రమత మెఱయ"

అహో! నిఖిల దేవాసుర బలకులితుడు, అనిగళిత నిఖిలభువన విదారణ దక్షుడు, మహాశైల విరావ మహాశక్తి ప్రభావుడు, విదితసర్వాస్త్ర సంహారుడు నగు రావణుడే కుపితుడగు రాముని జూచి భయకంపితుడై మృగేంద్రదర్శన మాత్రమున మృత్యుశంక బారిపోవు లేడివలె బారిపోయెను గదా! ఈ దురాత్ముడు రథ మెక్కి లంకాపురి కేగువరకు నేను వీని ననుసరింతును లేనిచో నీత డెక్కడ నే యనిష్టము చేయునో (నిష్క్రమించును)

రాము (కొంతసేపు ధ్యానించి బాణము విడువ జూచును)

భర ఆర్యా! శాంతింపుము ఈ వృక్షములు దగ్ధమౌటవలన పక్షిగణములు నిరావాసములై బాధపడ గలవు

"నిలునిలు బాణమేయకుము
  నీ విది! పక్షిగణంబు లెల్ల వి
ప్పులపట మాశ్రయించి తమ
  భార్యల బిడ్డల గూడియుండు, ఒం
టులమాలు లాఘవంబు లగు
  సత్యము పక్షులదేహముల్, భవ
ద్బల విశిఖాస్త్రము న్నికని
  పాతిమ వానిక వీరు మిక్కిన్"

"శరణాగతరక్షణమును
పరవాళము త్రిధర్మపరములు గా, భీ
కరనాశము వారింపుము
శరమును నుపసంహరింపు చయ్యన నార్యా!"

రాము: ఈ యస్త్రము సాపరాధము

భర: (ముందు చూచి) ఆర్యా!

"అపరాధాస్త్రం బదిరా ని
రపరాధం బగు సమంత్రమైనంతనె, నీ
కపగతమా స్త్రీవధ దో
షపరంపర, విడువకయ్య! శరము మహాత్మా!"

రాము (చూచి) ఔనౌను వారు మన ప్రాసాదచేటికలు ఓహో! మంథర కూడ (అంత చేటికలు మంథర ప్రవేశింతురు)

మంథ ఓసీ! దాస్య పరవశులు దాసులే యగుదురు మీరు మీ పనులు విడిచి యిట నిటు లాడుదురేల? మీరు వచ్చిన దారిని బొండు.

మధురిక మా పనులనుండి మమ్ము మరలింతు వేమి? మా చేటికలటనున్నారు నేను వటకేగెదను పనియైన పిదప బోవుదుము

మంథ ఏమే! ఏ పని కోస మెక్కడికి బోదువు? ఇది యుచ్చము ఇది నీచము వనక మీ రాణులు మీ కెప్పుడు పనులే చెప్పుదురా?

చతురిక నీవును దాసివే మేము మా రాణుల పను లెట్లు చేయుదుమో కైకేయి పనులు నీవు నట్లు చేయుదువు

మంథర నేను కైకేయికి పుత్త్రికా సఖి సమానను నేను సేవ చేయను సాయము చేయుదును మీరు గర్భదాసులిది యెఱుంగరు

చతు ఏమే దాసి దాసి యని యన్ని మాటలందువేమే?

మంథ ఔనే మీరు సేవకురాండ్రే నన్ను మా రాణి తల్లిగా పరమ దైవతముగా జూచును

మధు నీవు దాసి పని చేయుచున్నను నిన్ను నీ రాణి తల్లిగా పరమ దైవతముగా జూచుచున్నచో మేము మా రాణులకు దల్లితో సమ నలమే

మంథ నేను సంస్కృతము మాటాడుదును

చతు నీవు సంస్కృతము మాటాడినను నీయవినయము, ఆత్మస్తుతి నీదాసీత్వమును చెప్పక చెప్పుచున్నవి గొప్పవా రెప్పుడును దమ్ము దాము పొగడుకొనరు

మంథ మీ రిక్కడ నుండి లేచి పొండు మిమ్ము నే నాజ్ఞాపించుచున్నాను

అందఱు (నవ్వి) ఏమి దానికి గూడ నాజ్ఞాపింప నధికారమే?

మంథ (తనలో) ఈ గర్భదాసులు నన్నవమానించివారు నా యవమానము కైకేయి యవమానమే భరతుడు దగ్గఱలోనే యున్నాడు ఏమి లాభము? అతడెప్పుడు రాముని యనుసరించుచు జేత కాని వాడగుచున్నాడు ఇట్టివాని నెక్కడను జూడలేదు. (ప్రకాశముగా) నేను వెళ్ళి మీ యవినయము మా దేవితో చెప్పి యేమి చేయింతునో చూడుడు (నిష్క్రమించును)

చకు: కురూపమునకు దగినట్లు కుటిల భావము కల మంథర పోయినది ఆమె కురూపిణి యని యామె యనుకొనదు. ఈమె నిజముగా నందకత్తెయే యైన నేమి చేయుదు! మనురికా! గౌరీ మంటపము కడ నున్న పిప్పల వృక్షముల యాకులను గోసి కొందము రా!

పుష్పలతిక (పైకి చూచి) దీని యాకు లన్నియు జిల్లులు పడినవే! ఎందుచేతనో (అందఱు నాశ్చర్యముతో జూతురు)

చకు (భూమిపై జూచి) ఇక్కడ జాల గాలి గుర్తులు కలవు గుఱ్ఱపు డెక్కల గుర్తులు రథచక్రముల గుర్తులు కలవు

మను: రథములో నెవరు యిటకు వచ్చి రం కొందును

చకు ఈ గుర్తులే కాని రథము వచ్చిపల్లిన జాడ లేదే!

మను (భయముతో) ఏదో భూతము వచ్చిన ట్లున్నది బాబో! పోదము రండు (నిష్క్రమింతురు)

భర భయపడి చేటికలు పరుగెత్తుచున్నా రేలనో!

శత్రు అక్కడే సూర్యనియస్త్రము చిక్కుపోయినది

రాము ఎవడో మఱుగుపడి యట నుండియుండవచ్చు యోగప్రభావముచే మాయాశక్తివలన నదృశ్యముగా నుండవచ్చునని వింటిని యోగులు మోసకారులు కారు మఱి నాయస్త్ర మిట నెట్లు అదృశ్యమైనది? ఎవడో మాయచేసినాడు సరే నాయస్త్ర శక్తిల మాయని దెలియగలదు. అదృశ్యుడవై యున్నా వేల? ఓ యదృశ్యుడా?

"శరబద్ధుండగ బాణము
గొనియుంటివి తూణములోన గొనితేవేనిన్
అనుమాన మేల? క్రొక్కం
దును రక్తము పాలు కాదు దుష్టాత్మకుడా!

(బాణము సంధించును) (దూరమున వసిష్ఠుడు ప్రవేశించును)

భర (చూచి) అయ్యో! ప్రమాదము భగవానులు ఆర్యగురుపాదులే నీ బాణమునకు లక్ష్యముగా వచ్చినారు. బాణ ముపసంహరింపుము.

రాము (బాణ ముపసంహరించి) ఏరీ గురువులు? యోగప్రభావ పిహితదేహులై నా చికీర్ష జూచియుందురు వీరివలననే నాయస్త్రము మొక్కపోయి యుండును పూజార్హులగు వీరు నా బాణమునకు లక్ష్యమైరి ఇది తెలియక నేను దోష మొనర్చితిని

"శరముల నిప్పుడే సద్గురు
చరణంబుల నిలిపి పరమ సంభావ్యముగా
శరణంచు క్షమాభిక్షను
త్వరగా గోరుదము పరమసన్న్యాసుల గురులన్"

అందఱు రండు (వసిష్ఠుని పాదములపై బడి)

"సగుణుడవో నిర్గుణుడవో
భగవానుడ గతుచేయు బాలుగ మమ్ముల్
అగణితములు నీ కృపకే
ముగదా భావనల మాదుము జగద్వంద్యా!"

"సుతులు శిష్యులు నపరాధ శతము చేయ
గురులు క్షమియింత్రు వాత్సల్య పరవశులయి
బాలురము మేము తెలియక పాలుపడిన
దోషమును విస్మరింపు సంతోష మొదవ

వసి ఇదియేమి? విరోధము లేదు నాకు కోపమేల? దీర్ఘాయుష్మంతులారా! లెండు

రాము మహాశిలనైన బిండిపిండి చేయగల నా బాణము తెలియక వృద్ధులగు తమపై వేయ జూచితిని తప్పు క్షమింపుడు

వసి నీవు శస్త్రాస్త్రజ్ఞులలో బాలుడవే యైయుండవచ్చును గాని,

"నేను నీయంత బాలుడ నైనయపుడు
నింతకంటెను దివ్యాస్త్రమేసి ద్రోల్చి
కౌశికుండను మహాక్రోధకారణమున
గాని యది నాకు వెట్టివికార మీదు"

"శతదండ బాచు శమంబె బ్రాహ్మణునకున్
గాపాడు బ్రక్కోళవి
ప్రవిఘాతంబుల వారించి, భయము
పంతైన లేదందుచే
భవదీయాస్త్రమునన్, దలంప యమునకున్
బ్రహ్మాత్మయోగీంద్రుడ నే
ర విషాదంబున బారిపోవు నవశ
స్త్రంబుచే నేమి చేయంగలవన్?"

ఆహా! నా భర్తృదారిక యగు కైకేయి! నైతము రాముఁ డన్న నే యిష్టము. భరతుని కీ రాజ్యము రానిచో నా పేరు మంథర కాదు. అనార్యులు, అసురులు, పిశాచములు—వీరిని రామునికి శత్రువులుగా జేసి నేను భరతునే మహారాజును జేయుదును. వృద్ధవసిష్ఠుఁడుకాని కపట సుమంత్రుఁడుగాని యేమిచేయఁగలరో చూచెదను. అమ్మో! సుమంత్రుఁడు వచ్చుచున్నాఁడు (నిష్క్రమించును)

సుమం (ప్రవేశించి) ఇపుడు విశ్వామిత్ర మహర్షి వచ్చెను. మరల వచ్చుఁగ, రావణుఁడు వచ్చి పోయినాడు. తన యాతిథ్యము గైకొనక యేల రావణుఁడు వెలిపోయెనో యని మహారాజు ఖేదపడుచున్నాఁడు. క్షత్రియ వైరి యాతఁడు వచ్చుటేమి? ఆతిథ్య మిచ్చుటేమి?

"తిరుమూలంబున వాఁడి గొడ్డలిని శ్రీ
   తన్ దైచి ఖండింపగా
దొరకొన్నట్టి విరోధికిన్ బరవు సం
   తోషంబుతో నీవు వి
చ్చి రుచిన్ మించెసి పంక్తిలోఁ గని మహీయున్
   కైవ్వారు పుష్పంబునన్
గరుణామేయత నిచ్చు వృక్షము గతిన్
   ప్పట్టు నీ తంత్రిటన్

(తెర వ్రా)

ఇపుడు రావణు గిచటికి వేసుకొం—
నన్న సంగతి విని రాణు లసలు చుంత్రి
రాత్రులందు బురంబు సంరక్షణంబు
నప్రమత్తత రక్షకు లరయ వలయు

సుమం (విని) సరే నేను రక్కసులకిది తెలుప వేగవలె. (నిష్క్రమించును)

(గంధర్వులు ప్రవేశింతురు)

గంధ

రామం డప్రతి పోరునందు దలిచెన్
   రామాస్త్ర జాలంబులన్
శ్రీమాయ్యందను శాశ్వతిని, దప
   శ్శక్తుంబతం దన్న సు
త్రాముండున్ భయమందు, నాతని శర
   వ్రాతంబుచే రాముఁడే
దో మార్గంబున రావణున్ దునుము విం
   క్రుండించి దోషింపగన్.

రాముఁడే బలువైన వీరుఁడు
రామునకు సర్వాస్త్ర శస్త్ర రాశివశగుం
డా మహనీయుఁడే చంపును
దాముదమున రావణాది దనుజాల నెల్లన్

(నిష్క్రమింతురు)

ఇది తృతీయాంకము

## ప్రవేశిక

(ప్రవేశము నలుగురు వైతాళికులు ప్రాసాదమునై)

మొదటివాడు ఓరీ! భమకా! కటుకంఠా! నే నీగీతము నాగీతము చాలపాడ్లు విన్నాను నీవు విను నీగీతము ఒక్క వేణు శబ్దమురా

రెండవవాడు ఓరీ! మాళవకా! విను నీ స్వరము గార్దభస్వరమురా

మూడవవాడు మీ యిరువురకు గీతమన్న నేమిన్నా తెలియదు వాద్యములతో గూడిన నాగీతము మీరు వినుండు

నాలుగవవాడు నేను సంస్కృత గీతము పాడుదును మీకు సంస్కృతము రాదు అది చాల బాగుగా నుండును ఒక్కసారి నాగీతము విన్న రాజు మరల మీగీతము వినడు అదే నా గీతజ్ఞత.

మాళవకుఁడు : భావ! గోపిలుడు సంస్కృతమున జదువునట అది యెవరికి గావలయును? మహారాజు నాగీతము వినినా యిక మీగీతము వినడు

భమకుఁడు : నే నిపుడు ప్రత్యూషకాల మగుటచే మహారాజును లేపుట కేగుదును గోపిలుఁడు పాడుట కవసరము లేదు

మాళ ఓరీ! నీగీతము విన్న మహారాజునకు నిద్ర పాటిపోవునురా. అంతే కాదు. భృత్యులందఱు కూడ భయపడి పరుగెత్తుదురు

దంతిలుఁడు భావ! గోపిలుని వాద్యము లేక నీగీతము మహారా జెట్లు వినును? నేను నావాద్యము వాయింతును

గోపి నా వాద్యము లేకియా? సమయము వచ్చినపుడు చెప్పెదనులే

విదూషకుఁడు : (ప్రవేశించి) మీ రిక్కడ నేమి చేయుచున్నారు?

గోపి: సుందరా! స్వాగతము విశ్వామిత్ర మహర్షి వచ్చినాడు. మన మాతని జూతమలయా

విదూ: ఇప్పుడు

గోపి: ప్రతిదినము మహారాజు ప్రాసాదమునకు ఋషులు వచ్చుచునే యుందురుగదా! మఱి విశ్వామిత్రునిపై రాజున కింత పక్షపాత మేల?

విదూ: ఆయనకు రెండు ముఖములు, నాలుగు చేతులు, నీవు లేదు రెండుప్రక్కల ముఖమే కన బడును

గోపి: వీని కెందు కింత గౌరవము?

విదూ: ఓరీ! ఆయన బ్రాహ్మణుడు క్షత్రియుడు రాజఋషి. అక్షమాలాధారి ధనుర్ధరుడు ముందువెనుకలు చూడగలడు ఉభయతోముఖు డగుటకన్న నేమికావలయునురా?

గోపి: ఆ రెండు ముఖములతో నాయన యేమి చేయును?

విదూ: ఒకదానితో వేదము పఠించును రెండవదానితో శాపము లిచ్చును

గోపి: నాలుగు చేతులతో నేమి చేయును?

విదూ: రెండిటితో బ్రహ్మకర్మ రెండిటితో యుద్ధకర్మ

గోపి: కేవల నారాయణునికే నాలుగుచేతు లుండు నని చెప్పుదురు.

విదూ: భగవంతు డగు నారాయణునకు నాలుగుచేతులు ఒకముఖము. ఈయనకు రెండు ముఖములు రెండుప్రక్కల రెండురెండు చేతులు

గోపి: ఆయనను నీవు చూచితివా?

విదూ: ఓరీ మూర్ఖా! నేనే చూడవలెనటరా? విన్నను ఎప్పుడు చూచినదానికంటె విన్నదే యెక్కువ ప్రమాణము

గోపి: ప్రత్యక్షముగా జూచినవారే చూచినట్లు లెక్క.

విదూ: ఓరీ! మూర్ఖా! కన్నులకు బొగ క్రమ్మిన జాడ సత్యము గాదు చెవులకు బొగ క్రమ్మదు కదా?

గోపి: సరె నీవు విశ్వామిత్రులగూర్చి విన్నావు. నే నిపుడే చూచెదను.

విదూ: నీవు జాగ్రత్తగా జూచి చూచినది చూచినట్లు నాతో చెప్పు

గోపి: నీ విక్కడనే కూర్చుండుము ఆయనరా స్వయముగా నిన్ను జూచుట లేదా! రమ్ము స్వయముగా జూతువుగాని.

విదూ: అబ్బో! నే నాయనను జూడలేను ఆయనకు కోపమెక్కువట ఏమో! ఆయన దండ కాష్ఠములతో నాబుఱ్ఱ పగులగొట్టగలడు దూరమున నుండియే చూచెదను (తెరలో)

"మును శస్త్రంబులచే జగంబు గెలిచెన్,
బూర్ణుండు సత్త్వంబులో
నను, నిత్యంబు భయంబు గొందు నితం
డన్నన్ మహేంద్రుండు, జే
కొనె బ్రహ్మత్వము క్షత్రియత్వమును వా
కోరాని తేజంబు, ని
మ్మునిమూర్ధన్యుడు, గౌరవింపదగినన్
భాగ్యంబు లోకాళికిన్"

అదిగో విశ్వామిత్రులు వచ్చినారు రండు పోదము

(నిష్క్రమింతురు)

(ఇది ప్రవేశక)

## చతుర్థాంకము

(ఆసనస్థుడై విశ్వామిత్రుడు ప్రవేశించుచు)

విశ్వా

క్రతురక్షణ మనియెడుసాకు
కృతక ప్రోత్సాహమున రాము నిమ్మని రాజున్
బతిమాలెద నాయస్త్రము
లతిపాత్రున కితని కిచ్చి యానందింతున్

సుమంత్రుడు (ప్రవేశించి) భగవానులకు నమస్కారములు

విశ్వా: యశోవంతుడ వౌదువుగాక!

సుమం: భగవానుడా! నీయాశీర్వాదమున కృతకృత్యుడైన మహారాజిదే యిటకు విచ్చేయుచున్నాడు.

విశ్వా: సరే మహారాజాగమనము పాటింతును.

(మహారాజు, వశిష్ఠుడు, కుమారులు, విదూషకుడు, ఇతరులు ప్రవేశము)

రాజు పవిత్రీప్రపన్నులు, తపోధనులు, మహామహులు నగు విశ్వామిత్రులకు దశరథు డిదే నమస్కరించుచున్నాడు (నమస్కరించును)

విశ్వా (లేచి) అనామయ మగు యశస్సు లభించుగాక!

రాజు భగవానుడా! కూర్చుండియే యాశీర్వదము కురిపింపుడు

విశ్వా

పరగుదైవత్వపాలకత్వములు నీకు
కలిలు నిత్యము రాజత్వవర్తనంబు,
ఏల నిలుమంపరాదు నీపాల నేను
నీసభావిజయముగోర నెలసకుంచె!

రాజు

తాము నిలుచుంట మా కుచితంబు గాదు
ప్రభులు తాము శాసింపగా కలతులము,
తాము నిలుచున్న జగములు తక్ష్యముగను
నిలిచియే యుండును స్వకర్మనిష్ఠ లుడిగి

కూర్చుండుడు

విశ్వా (వసిష్ఠులతో) మహర్షీ! నమస్తే

వసి

తపమున బ్రహ్మత్వము గొ
న్న పరమఋషివి లభించె ననంతమహత్త్వం
బపుడె నీ కిక చేయుదు
గృపగొను ప్రతివందనంబు కృతకృత్యుడనై

కూర్చుండుడు (కూర్చుందురు)

కుమారులు పవిత్రులు భగవానులు నగు తమకిదే వందనము చేయుచున్నాము

(పాదములు ముట్టి విశ్వామిత్రునకు నమస్కరింతురు)

విశ్వా : అప్రతిరథులు, దీర్ఘాయుష్కులు, లోకప్రణయభాజులు నౌదురుగాక! అందఱకు భద్రమగుగాక! కూర్చుండుడు

(అందఱు కూర్చుందురు.)

రాజు తమ తపఃక్రియ ఏయాతంకములు లేక జరుగుచున్నదికదా!

విశ్వా

ధర్మపరు లౌచు రాజులు తనరుచుండ
నెటులు సుఖవంతు లౌదురో నృపులు నటులె
విఘ్నములు మాకు వొడమనివిధము కలుగ
క్షేమ మగు మాకు మాతపఃక్రియలు సాగు

వసి

పరమనృపులు స్వధర్మంబు పాటిసేయ
సౌఖ్యమబ్బుట ఋషుల, కాశ్చర్యమగునె!
చమురు కలుగుట గాలి వీసమ్ము లేమి
దీప మారక వెలుగదే దీప్తముగను!

విశ్వా (సగర్వముగా)

కరుణ వహించి రాజ్యము ల
కంటక మానటు చూచుచుందు మా
సురపతి ముఖ్యులై గలుగు
సూరులకైనను, రాజచంద్రులన్
బరమసహాయసంపదను
పాయక చేతను బ్రోచుచుందు; మీ
కరణి నొనర్పకున్న ఫల
కారిగ జూడము సత్తపఃక్రియన్.

(ఆలోచించి తనలో) ఇది నాకోరికకు విరుద్ధమగుమాటకదా! ఇట్లందును

(ప్రకాశముగా)

అఖిలముగ తపోవిఘ్నమ్ముల సకల ద్రోలు
నిన్ను నొక్కటి యాచింతు నేను నేడు.

రాజు

ఆజ్ఞసేయుడు మీయాజ్ఞ ననుసరింతు
బరమమాన్యుల పాదసేవకుడ గాన.

విశ్వా (వశిష్ఠునితో) భగవానుడా! అనంతబ్రహ్మర్షీ! ఈ దాశరథులు నలువురు యథావిధి నీచే నుపనీతులైరా?

వసి ఆఁ

విశ్వా వీ రవియే శాస్త్ర శస్త్రముల నభ్యసించిరి?

వసి : శాస్త్రము లన్నియు

విశ్వా ఏయే శాస్త్రములు?

వసి. మంత్రద్రష్టృత్వము తక్క నన్నివిద్యలలో వీరు నిష్ణాతులు.

విశ్వా ! ఈ వయసు వచ్చువరకే మీ రిన్నివిద్యలు నేర్చుట లోకవిస్మయకరవిషయము ఇది మీ మహిమయే కాని వేఱుకాదు.

వసి

దీపశిఖవలె గుణముల దీధితు లయి
స్నిగ్ధహృదయులు పరమ విశిష్టమతులు
నగుచు గుణ, బుద్ధి, విక్రతి ననవరతము
వెలుగి కనినారు సర్వవిద్యలను వీరు

విశ్వా హాయిగా మేడలోనుండి యనుభవజ్ఞానము లేక మీ రేక్రమమున నన్నివిద్యలు నేర్వ గలిగిరి ?

వసి

విమలహృదితో గురుబోధనముల వినుట
శ్రద్ధతో మననంబును జలిపి యెఱుగు
టాదిరైన క్రమంబున నఖిలశాస్త్ర
సముదయంబును నేర్చిరి చతురఫణితి

విశ్వా ఎప్పుడైన నెవరైన వీరిని బరీక్షించిరా ? ఏలన !

ఎన్నడు గురుండు సుస్నిగ్ధహృదయు డగుట
శిష్యు దలపోయు జ్ఞానవిశిష్టునిగన,
సర్వమున సంతతంబు నిసర్గమైన
ప్రణయ మరయు గుణాధిక్యమ్ము నిజము

వసి వీరిని బరీక్షింపగల సమర్థులే యింత వఱకు గానరాలేదు (కుమారులతో) దీర్ఘాయుష్మంతులారా ! విశ్వామిత్రభగవానులు మిమ్ము ప్రశ్నింతురు మీరు సమాధాన మిండు

కుమారులు చిత్తము

విశ్వా కుమారులారా ! అప్రతిమానశాస్త్రవిదులు, గురువులు, భగవంతులు నగు వసిష్ఠులవారు మీ కేమి నేర్పిరి ?

రాము (లేచి, నమస్కరించి) అన్నిటికంటె ముందు గురువులయెడ వినయము, స్నేహితులయెడ ప్రణయము, దీనులయెడ దయ, శత్రువులయెడ నిర్భయత్వము మాకు గురువులు నేర్పిరి పిదప భగవానులు నాలుగువేదములు సమంత్రార్థసంగ్రహముగా వ్యాకరణము, అర్షపద నిర్వచనము, గ్రహచారము, పతంజలి యోగశాస్త్రము, మానవాచారశాస్త్రము, చతుర్వింశతివ్యవహారనిర్ణయము, వానిష్ఠరాజశాస్త్రము, మేధాతిథివ్యాయశాస్త్రము, కాశకృత్స్ని మీమాంసాశాస్త్రము, విశ్వకర్మోక్తోపయోగశాస్త్రములు, గజాశ్వరత్నపరీక్ష, శకునజ్ఞానము, కావ్యకళ మున్నగునవి నేర్పిరి కళల కన్నియు బాగుగా వచ్చును. నేను గొన్ని విద్యలు, కొన్ని జ్ఞాపక మున్నవి

భరతలక్ష్మణశత్రుఘ్నులు.

ఆహా ! ఆర్యుని మహానుభావత్వము !

సద్గుణం డన్యగుణము లేశంబునైన
గాంచు నుత్కృష్టభరితంబు గాగ నట్లె
ద్వేషమునకు లక్ష్మ్యుత్తమశ్రేణి వయ్య
స్వల్పములు గా నెపుడు చెప్పం దలంచు.

విశ్వా సంతుష్టుడనైతిని ఇక శస్త్రాస్త్రము లెట్లు నేర్చిరో చెప్పుడు ?

లక్ష్మ (రామునితో) ఆర్యా ! నా చాపలము క్షమింపుడు దీనికి సమాధానము నేను చెప్పెదును.

రాము సరే

లక్ష్మ (విశ్వామిత్రునితో) భగవానుడా !

అన్న యెఱుగును వేదంబు లన్ని గూడ
జ్యేష్ఠుడును శ్రేష్ఠుడును నా విశిష్టశస్త్ర
శాస్త్రముల, మాకు నెదిరెయ్యు లేశంబు తెలియదు,
గాని యట్టులు నతనికి గాను పాట

మఱియు

జనక పాదారవింద ప్రసాదము నను
అస్త్రశస్త్రాదివిద్యల నాఱితేరి
నార, మయ్యవి విజయసేనాపతిక-
నిత్యమును సాధనము చేసి నే డెనాము

విశ్వా

శాస్త్రశస్త్రంబు లెఱుంగ జాలినట్టి
సన్మునీషియె యగు బలశాలి మాకు
కుంభజుడు వార్ధిజలమెల్ల గ్రోలగింట
మరల నింపుట యుత్కృష్టమహిమకలిమి.

వత్సా ! నీవు గల రామభక్తి ని న్నెంతయు నభినందించును ఎద్దుట స్నేహము, భక్తి ప్రకాశించునో యచట గుణము నుండును మీ శస్త్రాస్త్రము భవము నెట్లేచట ప్రదర్శించితిరి ? ఏలన

మథన మొనరించినన్ గాని దధివి గాదు
శ్రేష్ఠమైనట్టి నవనీతసిద్ధి, యటులె
ప్రబల మనుథితము లేనిచో విలయు యాగము
నదియు నృపులకు గాదు సహాయకారి

విదూ ! నాకు మరల దధి కావలయును దధి తిన్న ఘృతము తిన్నట్లే కదా !

రాము

వస్తువున కెట్లు ద్రవ్యరూపములు గలుగు,
వాక్యపదముల కుత్తమ భావములగు,
గురులతో మైత్రి వాటించు కరపదగును
అటులనే శాస్త్రము ప్రకాశ మంద గాంచు

మఱియు

చెట్టునాకుల ఒలియింప జేయగలము
కిలల ముక్కలుగ బొడిపొడి జేయగలము,
అస్త్రశస్త్రములన్ వృక్షముల నుద్ధ,
మిది యొనర్పంగ సనుథిత మెసగు మాకు

విశ్వా

వివయు విస్పష్ట తధిక విలసితములు
మీరు పలికిన సూక్తులు మిమ్ము జూ
తెలియు వీమన్న శస్త్రాస్త్ర దివ్యశక్తి
సంశయము లేదు వాకయ్యె సంతసంబు

ఈ యభ్యాసపద్ధతి యెచ్చటను లేదు అస్త్రముల కెట్టు గపిల్పగల మీ నవ్విత వినముగా ప్రశంసా తీతము.

విమా చెట్టుఆకులు కదలిన నేమి లాభము? ఎండిపోయిన చెట్టు కొమ్మలు విరిగినను ప్రొయ్యిలోనికైన వచ్చును వంటచెఱకునకు జాల కొఱతగా నున్నది కూడ

రాజా విశ్వామిత్ర! వాసలకిది చెప్పలేదు నేను వీరి వనుపునపుడు వేటకు గూడ గొనిపోవుచుందును

విశ్వా వనములందలి కేసరి, గజ, మహిషాదులగు మృగములు రాజుల కేమి యపకారము చేయును?

రాజా అవి యాత్రులను సస్యములను హింసించును

విశ్వా అవి బలిష్ఠములై ధర్మ ప్రజాపీడ కల్గించిన దండింపదగినవే కాని, శస్త్రాస్త్రములతో జంపదగినవి కావు ప్రకృతి జనులను పీడించుచు సర్వత్రలోపమును గల్గించు మహాబలవంతులగు రాక్షసులనే శస్త్రాస్త్రములతో జంపవలయును. నీతో గూడ వీరి నంపి దీసికొనిపోవుటవలన వీరికి యుద్ధక్రియ లెట్లు తెలియును?

రాజా బలవంతులగు మృగములను దగ్గరకు రప్పించి వానిని వీరిచే జంపించి వీరి నిపుణత నరయుచుందును

విశ్వా సరేకాని, పాపాత్ములగు రాక్షసుల జూచి యూరకుంట తగదు

రాజా గ్రామవాసులు కృషీవలులు, గోపాలురు, వణిజులు, సార్థవాహులు నెవ్వరును రాక్షసపీడనుండి కాపాడ నన్ను గోరలేదు

విశ్వా అసురులు ధనలుబ్ధులు కారు అందుచే కృషీవలులజోలికి వణిజులజోలికి రారు తపోవనములందు యజ్ఞములు చేయు తాపసులకు విఘ్నములు కలిగింతురు

రాజా ఋషులు కాని తపస్వులు కాని నన్ను సాహాయ్యము చేయుమని కోరనే లేదు

విశ్వా ఋషులు తపస్వులు స్వరక్షణకై క్షత్రియ సాహాయ్యమును యాచింపరు.

రాజా నన్నెవరును గోరకుండగనే నాకు తెలియని శత్రువుల కెట్లు రూపుమాపుదును ?

విశ్వా

"ఎవ్వరు కోరగా దమము
నెప్పుడు బాలగ్రహోలు మూర్యుడు
నెవ్వరు కోర వాయువు వది
యెల్లడ వీచు జగంబులోన ? మ
రెవ్వరు కోర శేషుడు మహీ
దలపై నిలుపుట ? దలంపగా
నవ్విధి రాజు పాలుర వయాచిత
ధింగి నణంపగా దగున్ "

రాజా పాపులను శాపముచే ఋషులేల నివారించుకొనరాదు ?

విశ్వా శపించుటవలన పుణ్యము క్షీణించును అందుచే వారు నెల్లప్పుడును శపింపరు

"శాప మసహ్యపాపజన సం
తత జాతక శోకదండమా ;

తాపసవృత్తిలో మెలగు
    ధనుర్వల కళ్యాది సర్వమున్, జగా
రోపితకోప మయ్యెది, యొ
    ఱుంగ, ఫలం బది తాపసీనకు
స్థాపితకీర్తి శౌర్యగుణసంపద
    కింక? తెలుంగ జెప్పుమా!

రాజు సంతోషము నాకు రత్నమేమో తామే తెలపియుండు

విశ్వా సరే! ఒకసారి రెండు చెప్పుచున్నాను.

రాజు ఏ వవి?

విశ్వా గుణహారుమనమోజ్యేష్ఠుడు నీ కుమారుడగు రాముడకు దివ్యాస్త్రములనుపదేశించితివా?

రాజు నా నేర్పిన దివ్యాస్త్రము లన్నియు సుమారుల కొసంగితిని రాముడని యన్నియూ జక్కగా ప్రయోగింపగలడు నాకు రెండస్త్రములే తెలియనివి

విశ్వా ఏవవి?

రాజు జృంభకాస్త్రము, బ్రహ్మాస్త్రము

విశ్వా బ్రహ్మాస్త్రమిదు లొక్క వసిష్ఠ భగవానుకే

వని నేను ఎర్వాస్త్రసంహారము చేయగలను గాని యేయలేను

విశ్వా అవి రెండు నెఱిగియే నేను బ్రహ్మత్వమందినాను

రాజు జృంభకాస్త్రములుకూడ వమకు దలియునా?

విశ్వా చక్కగా

రాజు అగుచో గొంతకాలము తా మిటనుండి కుమారుల కవి నేర్ప నర్థించుచున్నాను

విశ్వా అది యర్థములేని మాట

రాజు ఏల?

విశ్వా

"అర్థి యరుదెంచు దాల గృహంబునకును
దాత యరుదేదు కెంట వానిని గోర,
దప్పి చెందినవాడె కొదకును చరము
సరము నదకదు తృషితుడా నరుని మరల.

రాజు నా గృహమంతయు దమదే తమకు నేను నమస్కరించినప్పుడే నా యీ సర్వస్వము తమ యధీన మయ్యెను తా మిటనే యుండి మమ్మనుగ్రహింప గోరుదును

విశ్వా రాజగృహంబు నానా వ్యవహారాకులము సౌధసౌఖ్యములను విడిచి వన్యఫలాశనులము, వ్రతపరంపరావితులము, బ్రహ్మవిచారనిహిత మనస్కులము నగు మావంటివారికి మరల నిటనుండి వేల తలంపు కలుగును? గృహస్థుని యావాసము వివిధ వ్యాపారనిలయము బ్రహ్మపరులక్రియలకు నేకాంతవాసమునకు యోగ్యముకాదు పర్ణశాలలయందే నిర్జనముగా వసించు తాపసులకషె గృహస్థులు వచ్చి యుండెగలరా? తాపసులు రాజసంపదలను ముట్ట నొల్లరు

రాజు తమ చిత్తము నేను పరిహాసమున కవ లేదు

"నేను ప్రవృత్తి భృత్యపతి
    నిశ్చిత మంత్రిబలంబుగా సుఖా
సూన సుశోభవాహన మ
    హోత్తమ కోశ, నాదికంబుతో
మానిత మామకీన మణి
    మండిత కేళి రనాదికంబుతో
మీ నుత పాదపద్మముల
    మెప్పుగ చేసెద దాపకర్మలన్"

విశ్వా రుద్రస్వేదము, మునిమనము, వీరపాణి, రామారుచి, బలవిక్రాది సంపదలు వస్తుబంధింపజాలవు

వని యొుక్తిపరుల లివి యేవియు బంధము నొసంగజాలవు ఏలన, గంధాశ్మము, రుద్రస్వేదము నకు విలువడు భక్తిచే మునిమనస్సును రంజింపజేయవచ్చును నమస్కారముచే వీరపాణి సంతసించును దాక్షిణ్యము చూపినచో రమణీసౌందర్యము బాధింపజాలదు

విశ్వా ప్రాకృతు లగుజనులు ప్రాసాదవాసులలో గుణము గుణింపరు ఇంతకు దేశకాలపాత్రములే వస్తుగుణవికాస హేతువులు ఎట్లన,

"సరసున సరోజతతి వికాసంబు గాంచు
కులయ పర్వతమందున విలయుం జంత

# "మహా ప్రస్థానము"



శ్రీ పొట్లపల్లి సీతారామారావు

"కవిరేవహి జానాతి కవేః కావ్యపరిశ్రమమ్" అన్నాడొక యాలంకారికుడు. కవి కావ్య పరిశ్రమములోని చిక్కులు కవికే తెలియునట. అందుకే విమర్శకుని బుద్ధి కవిప్రతిభవెంట ప్రసరించి తద్గతమైన శిల్పమును విప్పిచెప్పవలెను. అంతేగాని మూలసూత్రమునకే యెసరుపెట్టరాదు. కవి యదభిముఖముగా కావ్యము నిర్మించెనో తదభిముఖముగా విమర్శకుడు కావ్యమును జూడవలెను. తాను భావించిన యందులేని విమర్శ విమర్శయే గాదు. కవిసిద్ధాంతముతో మన మేకీభవించకపోవచ్చును. కాని కవి శక్తిగలవాడైనచో నా శక్తిని యొప్పుకొనియే తీరవలెను. కవికాలమునాటి సాంఘికజీవనము, — కవికిగల శాస్త్రీయదృష్టి, — కవికిగల పాండిత్యము వీనిని పరిశీలించి వ్రాసినంతమాత్రమున విమర్శ సంపూర్ణము గాదు. అవి *Comparative Criticism, Historical Criticism* అను పాశ్చాత్య విమర్శల ప్రతిబింబములుమాత్రమే. కాని నిజమైన విమర్శకుడు తన బుద్ధిని కవిప్రతిభ ననుసరింపజేయును. ఆ ప్రతిభను పట్టుకొని చెప్పుటయే విమర్శలోని ముఖ్యాంశము.

లోకములో నన్ని భావములు రసమయములుగా నుండవు. రసానుగుణములైన భావములు కొన్ని మాత్రమే యుండును. ఆ భావములన్నియు పూర్వకవులచే ననంతముగా మలచిమలచి చెప్పబడినవి. పూర్వకవుల ఛందస్సులన్నియు నా భావములను వ్యక్తముచేయుట కేర్పడినవే. అట్లు రసాభిముఖములుగాలేని భావములకన్నిటికి ఛందస్సుకల్పించి యా భావము నొక చమత్కారముగా పోతపోసిన కవి శ్రీశ్రీ. "ఏవస్తువునైన కవి తన ప్రతిభనుబట్టి రసవంతము చేసికొనగలడు" అన్న ఆలంకారిక వాక్యము వస్తునిష్ప్రత్యక్షతచేత యామాత్రమే. అయిన శ్రీశ్రీ భావములు రసవంతములుగావా? అని ప్రశ్నించవచ్చును. రసవంతములనగా విభావాదిక కల్పనచే భావించుటయేకదా! అట్లైనచో ప్రతివాక్యమునకు వేదోవిధముగ విభావాదికకల్పన సేయవచ్చును. "మృగో, ధావతి" అన్నవాక్యమునుగూడ రసవంతము కావలసివచ్చును. శ్రీశ్రీ భావములు రసన— చర్వణ—ఆస్వాదన—వీనిచే సాధింపదగినవి కావని నా యభిప్రాయము. వాల్మీకి, నన్నయ్య పూర్వకవులు ఛందస్సుల సృష్టించుటలో నెట్టిస్థానములు పొందిరో నేడును ఈ ఛందస్సును సృష్టించుటలో శ్రీశ్రీ అట్టి స్థానమును పొందెననుట యతిశయోక్తి కానేరదు.

శ్రీశ్రీ చదువుటతోడనే ప్రప్రథమమున స్ఫురించునది యతని శబ్దముల పొందిక. ఒకవిధముగా చెప్పవలసివచ్చిన యీ కవి విలక్షణతయంతయు నా శబ్దముల సంఘటనలోనే యున్నది. ఏ శబ్దమును ముట్టుకొన్నను గింగురుమని మ్రోగును. కొన్ని కొన్నిచోట్ల శబ్దముల కర్థమే యుండదు. కాని యా శబ్దసంఘటనచేత ప్రధాన భావమునకు దీప్తినిచ్చును. ఇతని సంఘటనలోని యొక లక్షణము ఉచ్చారణ విచ్ఛిత్తి సామ్యముగల శబ్దముల నొకచోట పాదిగి భావము నుద్దీపితము జేయుట

"ఇరవై కోరల, అరవై కొమ్ముల,
క్రూరఘోరకర్కోటకులో?
కోరకి కన్నా, కొమ్ముకి కన్నా,
కర్నాటక కర్కోటకులో"

ఈ కర్నాటక శబ్దమున కర్థపుష్టిలేదు. కర్కోటకత్వముయొక్క అనవధికత్వమును సూచించుటకు కవిచే వాడబడినది. ఇట్టి వనంతములున్నవి

"దారుణమారణ దానవభావంలు!
ఫేరవభైరవ భీకరఘోషలు
ఘోషల, భాషల,
ఘంటల మంటల
కంటక కంఠపు గణగణలో?
చిటికెల మెటికెల చిటపటలో?"

ఈ శబ్దజాలమంతయు కవికి నుద్రేకములో నప్రయత్నముగా దొరలును. అది లౌకికమునైన భావ

ములకు చమత్కారము గల్గించును. రసానుగుణము లైన భావములు కేవలము శబ్దాశ్రితములుగాకే భావింపవు దానికి నూహాలో దిరుగవలసిన కల్పనము లనేకములు గావలెను అందుకే యాలంకారికులు "ప్రాయశో యమకే చిత్రే రసపుష్టిర్న దృశ్యతే" అన్నారు ఈ భావములు రసవంతములు గావు కావున నేదో శబ్దముల యింద్రజాలముచే మెఱపి పోయి చమత్కారహేతువులగును చిన్నపిల్ల లాటలాడునప్పుడు "ఉరుములు మెరుములు ఉటారు తీగలు" ఈ శ్రేణిలోనివే అక్కడ శబ్దముల కుదింపుకున్న ప్రాముఖ్యము అర్థమునకు లేదు ఈ కవికి నభిమానకవి స్విన్‌బర్న్ ఆయనకూడ శ్రోత్రశ్రోత్ర ఛందస్సులు సృష్టించిన కవి *Diction* లో నతి పంచ వేసినవాడు అందుకే ఆ కవిని

"శశీ! నీగళగళచ్ఛంగళ
ళళా శౌవాళవాళాపాళిలో
కలసిపోతిని! కరగిపోతిని!
కానరాకే కదలిపోతిని!"

అని కీర్తించినాడు ఇదంతయు శబ్దముల యింద్రజాలమే

ఈ కవి శబ్దములపోకడయే భావమును స్ఫురింపజేయును ఎంత తీవ్రభావమునైనను శబ్దచ్ఛాయల యాశ్రయముచే పరువెత్తించగలడు ఆ శబ్దములను గిలుకరించి గిలుకరించి కదుకెక్కించును ఆ కదుకు భావోద్వేగస్ఫోరకము అంతేకాని ప్రతిశబ్దమును— అర్థమున—విడదీసి చూచినచో నర్థము సరిపోవచ్చును కాని భావోద్వేగము స్ఫురింపదు పదములను వ్యత్యయముగా వాడి ఈ కవి అనేక చమత్కారములు చేయును

"పటఘూర్ణటి
నిటాలాక్షి పగిలిందట!
నిటాలాగ్ని రగిలిందట!
నిటాలాగ్ని!
నిటాలార్చి!
నిటాలాక్షి పటాలుమని
ప్రపంచాన్ని భయపెట్టింది!"
"అదె ఝూం! ఝూం!
ఝటక్, ఫటక్
హింసనదన
ధ్వంసరచన!
ధ్వంసనచన
హింసరదన!
విషవాయువు,
మరఫిరంగి,
టార్పీడో, టోర్నాడో!"

ఇట్టి శబ్దసంఘటన కుదురుట కష్టము ఈ కవితలోని ప్రాణమంతయు నా శబ్దసంఘటనమీదనే యున్నది శ్రీశ్రీ యనుయాయులు శ్రీశ్రీవలె ప్రశస్తిలోనికి రాకుండుటకు ముఖ్యకారణము వారియం దీ శబ్దశక్తిలోపించుటయే ఆ ఛందస్సునకు— ఆ భావమునకు—ఆ శబ్దసంఘటనయే ప్రాణము అది లేనిచో నా కవిత్వమే లేదు అట్టి శబ్దవిన్యాసముగలవారలే యా కవిత్వమునకు ప్రయత్నించవలెను

ఇతని యుపమలు క్రొత్తవి "ఆకాశపు పిడారిలో కాళ్లు తెగిన యొంటరి యొంటెలా వుంది జాబిల్లి," "శరీర శేఖరముగా కదలకు కొంప" ఈ యుపమలు రచన రసమునకు సన్నిహితముగా పోవుచున్నదేమో యన్న భ్రమ కల్పించుచున్నది చంద్రుడు శృంగారమునందే యుద్దీపనవిభావనగా వాడుట మనవాడుకదుగు ఇక్కడ చంద్రుని ఒంటెతో పోల్చిన స్థితి కవి మనస్థితిలోని శోకము నుద్దీప్తికి దెచ్చుచున్నది "కూర్చున్న ముసలిది యారిన కుంపటివలెనున్న" దనుట, 'రాత్రి నల్లనిరాతివలె' నున్నదనుట కవి ప్రతిభాధీనమయిన విచిత్ర మనఃప్రవృత్తిని బోధించుచున్నది అన్ని యలంకారములకు నుపమయే మూలము ఈ యుపమాలంకారముచే భావము తేలికగా స్ఫురించును ఉత్ప్రేక్షాదులు భావమును మిక్కిలి క్లిష్టము జేయును ఈ కవిలో భావము మాటిగా తేలికగా స్ఫురించునదీ యలంకారము పట్టులలో మాత్రమే మిగిలినదంతయు అసంగతము యర్థము జెప్పుకొనవలసినదియే అలంకారములు వాడని కవి యుండడు కొందఱుకవుల యలంకార నిర్మాణశక్తియే వారి కావ్యనిర్మితిలోని ప్రాణమగుచున్నది కాళిదాసుని యుపమ, కృష్ణరాయల స్వభావోక్తియు నీ శ్రేణిలోనివే. ఈ కవి రూపక క్రమాలంకారములు వాడును కాని యవి యంత చమ

త్కారముగా నుండవు. కొన్నిచోట్లు క్రమాలంకారములో వరుసగూడ తప్పియుండును.

"స్వర్గ, నరకముల, ఛాయాదేహాళి
తెలి, నలి, తలుపులు తెఱచి మూసికొను
సర్గ, విలయ, హేమంత, వసంత,
ధ్వాంతకాంతి విక్రాంతి వేళలో"

సర్గ విలయములకు క్రమముగా వసంత హేమంతిములని యుండవలెను కాని యిందు తద్భిన్నముగా నున్నది

ఈ ఉక్తివైచిత్ర్యముచేత భావమునకు పుష్టి రాక పోయినను చమత్కారము జరుగును ఆ చమత్కారము కవిమనస్సులోని చురుకుదనమును వెల్లడించును శ్రీశ్రీ మనస్సు చమత్కారము తిరిగిన పన్నముద్దవంటిది ఆ చమత్కారములో మరల నొక వైశిష్ట్యమున్నది హిరణ్యాక్షుని హిరణ్యనేత్రుడనుట—హిరణ్యాక్షుడు రూఢమైన శబ్దము అందుండి హిరణ్యనేత్రుఁడని విరుపు హిరణ్యమనగా బంగారము డబ్బుగలవాఁడు నర్థము స్ఫురించుట కొఱ కట్లు చమత్కరించుట అట్లే క్రుద్ధనృకోదరుడు—దాని వ్యుత్పత్త్యర్థముచే భయకృముకలుగుట ఇవియన్నియు శ్రీశ్రీ కవిత్వమునకు మెరుగుపెట్టుకొనుట కేరుకున్న యుక్తులు ఆ యుక్తిచేత జరిగిన మెఱితిస్ఫురణ—ఆ స్ఫురణలో నొక విచిత్రమైన యనుభూతి—ఆయనుభూతిని పొగడీచెడి శబ్దముల పోత విలక్షణాతి విలక్షణముగా నుండును పంకజమనగా కమలమని యర్థము ఇది రూఢము ఆ శబ్దమును తీసికొని కవి చిత్రముగా వాడుకొనును "పాపపంకమునుండి పద్యాలు పుట్టించి" ఈ విరుపులే ఈ కవిత్వమునకు శోభాహేతువులు ఈ మాట విరుపులన్నీ చమత్కారముకొఱకు పూర్వకవులు చేసినవారే అందులో ప్రబంధకవులలో విది మెరమారిపోయిన గుణము విజయవిలాసకర్త "అమ్మకచెల్ల! నా హృదయ మమ్మకచెల్లదు నీవి యోగ్యమన్" అను పద్యభాగము ఈ శ్రేణిలోని యొక చమత్కారభావమే ఇదంతయు చిత్రకవిత్వములోని భాగము ఆ భావములకు—ఆ ఛందస్సునకు—అది యెక్కడ పుష్టినీయదు ఈ భావములు—ఈ ఛందస్సున కివి యెక్కడ పుష్టినివ్వకపోవు. అసలెక్కడ రసదర్శకత్వమేలేదు. కేవలము బుద్ధిచమత్కారముకొఱకు మాత్రమే యివి వ్రాయబడినవి. ఈ రచనవలన కలుగు ఫలమే యిది

ఈ గ్రంథములో కల్ల కొలికిపూసలవంటి రెండు ఖండములున్నవి అవి "బాటసారి" "భిక్షువర్షీయసి" ఇందు కవిప్రతిభ కొల మీరిపోవుచున్నది ఒక పేదబిడ్డ పట్టణములో కూలి జేసికొని బ్రతుకుటకై తల్లిమాట లెక్కపెట్టక బయలుదేరును. దారిలో నవేక కష్టపరంపర నెదుర్కొని మరణించును దీనిని కవి నిర్వహించుట హృదయగ్రాహిగా నున్నది. ఈ ఖండమంతయు మూడు ప్రయత్నములచే జెప్పబడినది అసలు కథకునికి కథాగమనము మలుపు తిరుగవలసి వచ్చినప్పుడెల్ల పట్టు తప్పకుండ జేయుట కష్టము నేటి చాల కథలలో నీలోపమే కనుపించును కథకుని మొదటి ప్రయత్నమునకు రెండవ ప్రయత్నమునకు సంబంధమే యుండదు ఈ కవి బాటసారి కష్టపరంపరలన్నియు తల్లి భావము మీదుగా నడపును కథ మలుపు తిరిగి రెండవ ప్రయత్నమునకు మరలునపుడు రెండింటికి *Link* గా "పల్లెటూళ్లో తల్లి ఏమని పలవరిస్తోందో" అని విడిచిపెట్టును ఇది హృదయములో చురుక్కుమనును పఠితహృదయము వింతగా వాకర్షించు మార్గముండదు మూడవ ప్రయత్నములో బాటసారి మరణమును జెప్పువాడు ఆ మరణము వివిధ విధములుగా స్ఫురించునట్లు జేసినాడు "వేడుచుక్క వెక్కిరించినదట",—"కోడికూత వేగుజామును దెలియజేసినదట" "బాటసారి కళేబరంతో శీతవాయువు ఆడుకొంటుందట" "పల్లెటూళ్లో తల్లికేదో పాడు కలలో కేసు కదిలింది" అనుదానితో నంతము జేయుటలో శిల్పమున్నది ఈ కావ్యఖండము తల్లితోనే యారంభింపబడి తల్లితోనే యంతమైనది కథకు కావలసిన బీజ నిర్వహణముల సమైక్యమిందు సూచితమైనది ముద్రారాక్షసకారుడు సూత్రధారునితో "ముకవి కావ్యములోనలె బీజములో నొకటి నిర్వహణములో మరొకటి" అని అనిపించినాడు ఇది ముకవులను గురించి యాక్షేపణ. అట్టి వాని కళంకము బొందని కథాశిల్ప మితని సొమ్ము

రెండవది 'భిక్షువర్షీయసి' దిక్కులేని ముసలిదాని కథ ఇది కథగాదు ఒక పరిస్థితి మాత్రమే. కాని కవి యుద్దీపన విభావముల మూలకే పోతపోశ

కథనరీతి భ్రమ గల్పించినాడు భిక్షువర్షీయుని చుట్టూ నూరకే యుద్దీపన విభావములను గుప్పించుచు పోయినాడు. చిట్టచివర కాయుద్దీపనవిభావములే నిర్వహణ యోగ్యములై మసలిదానికి నంపగా వించి నవి "రానున్నది చలికాలం" 'అడుక్కునే శక్తి లేదు' ఇవి యన్నియు నుద్దీపన విభావములే ఇందులో నుద్దీపనవిభావముల కంటె మించి పొందిలేదు కాని చమత్కారము—కథనరీతి నున్నది

ఆధునికకవులలో నవ్యజాతీయము వాడుట యొకటి సంప్రదాయముగ నున్నది అట్లనవ్యజాతీయము వాడుటలో నేమి విశిష్టత యున్నదో తెలియదు మీదు మిక్కిలి పఠితకు అర్థక్లిష్టతాపాదన కలుగును సంప్రదాయ సిద్ధమైన పలుకుబడిలో శ్రోతను గచ్చగొట్టినట్లుగా నవ్య-తీయముచే సాధ్యముకాదు ఇతర భాషాపాండిత్యము కేవలము తత్త్వార్థగతమైన శిల్పము వలవరచుకొనుటకే ఆ కావ్యములలో శ్రోతను పట్టుకొనుటకు తప్పు లుపయోగించిన మార్గము లేవో తెలిసికొని వానిని తన కావ్యమునం దిమిడించుకొనవలెను అంతేగాని సంప్రదాయభిన్నమైన పలుకుబడిని ప్రవేశ పెట్టరాదు "యముని మహిషపులోహఘంటలు మబ్బుచాటున ఖణేల్ మన్నాయ్" అన్నప్పుడు పఠిత హృదయము పొంగినట్లుగా "నరకలోకపు జాగిలమ్ములు గొలుసు తెంచుక పరువులెత్తాయి" అన్నప్పుడు పొంగదు. దీనిలో పఠిత తాత్పర్యార్థముచే గ్రహించును గాని గ్రీకుసంప్రదాయములోని "హెల్ లోని "డిర్కా" స్ఫురణకు రాదు యముని మహిషపులోహ ఘంటలన్న ప్రయోగాలతో చేర్చిన సంప్రదాయములోని ఛాయ మనస్సు నమితముగా రెచ్చగొట్టును ఈ గేయములో మిగిలిన వన్నియు మరల సంప్రదాయము వైపునకే మొగ్గినాపును "కనకదుర్గ సింహ మావులించుట—" "ఇంద్రుని మదపుటేనుగు ఘీంకరించుట"—"ఉదయ సూర్యుని హయము నురుగు గ్రక్కుట" ఇవి యన్నియు పాఠకుని యుత్సాహ లూగించును

"ఎగిరిన ఇనుపడేగ—" "ఎగిరే లోహశ్యేనం" —"అగ్ని శిరస్సున వికసించిన వజ్రం" —ఇవి తల పగులగొట్టుకున్నను నర్థముకావు ఇట్లనుటచేత స్వసంప్రదాయ ప్రయోగము లేకని వాడమని కాదు, సంప్రదాయ సిద్ధమైన జాతీయముగాని మాట వినుపుగాని వాడినపుడెల్ల హృదయస్పందనము జరుగుచునే యున్నది

ఒంఘిజ్ ఖాన్, తామర్లేను,
నాదిర్ షా, ఘజనీ, ఘోరీ
సికందరో ఎవడైతే నేం ?
ఒకొక్కడు మహాహంతకుడు"

ఇంతలో ఎవడైతే నేం ? అన్న విరుపు తెలుగు పలుకుబడిలోనిది ఆమాట యీ పద్యమున కొంతైన యందము దెచ్చినది ఆ పలుకుబడికే కవి పాటుబడినచో కావ్య మెంతేని రమ్యముగా నుండెడిది

తిరువాలి ఛందస్సు ఈ ఛందస్సు మొదట వైదికముగా ఒయాలుదెపలినది అక్కడ దాని ప్రయోజనము వేలు మంత్రములలోని శక్తి నధికము చేయుటకే. దాని ప్రయోజనము గాయత్రిమంత్ర మున్నది అది యీ ఛందస్సులో జెప్పిన గాన యా దేవత ప్రసన్నగాదు అందుకే ఋషులను మంత్ర ద్రష్ట లందురు భారతీయులోని రుద్రోపాఖ్యాన మంతయు నీ వైదిక ఛందస్సుల ప్రాబల్యమును సూచించుటకు వ్రాయబడినదే లౌకికమైన వాఙ్మయమునకు సరిపోవునట్లుగా దీనిని మార్చినవాడు వాల్మీకి సాధారణముగా నున్న భావములన్నియు, ననుష్టుప్పులలోనే చెప్పి విశేష భావములకు ఛందస్సు మార్చి చెప్పెను కాని ఛందస్సును మార్చి భావము నుద్దీపింప చేయుట కాళిదాస భవభూతుల చేతులలో గాని నిగ్గుదేరలేదు కాళిదాసు కుమారసంభవము లోని రతివిలాపమంతయు వియోగినీవృత్తముచే జెప్ప బడినది అదియునుగాక సంస్కృతిభాష నాటక యోగ్యమైన భాష అందుచేతనే సంస్కృత నాటకములవంటి నాటకములు సృష్టిలో లేవు దానిని కావ్యమునకు యోగ్యముగా ద్రిప్పిన వారు కాళిదాసాదులు నన్నయభట్టు కూడ సామాన్యముగా పద్యములు వ్రాయుచు విశేషముల నుద్దీపింప జేయ వలసి వచ్చినపుడు వివిధములైన వృత్తములు వాడును అందుచేతనే యే కారణముచేత వాల్మీకి మహాకవియో నన్నయగూడ నా కారణముచేతనే మహాకవి యగుచున్నాడు

అసలు ఛందస్సులోనే వ్రాయవలెనను నియమము మేల కావలసి వచ్చినది ? గద్యములో వ్రాయవచ్చును గదా యన్నచో భావము గద్యములోకంటె ఛంద

ప్పులో మెఱుగు చేయుటయే ప్రమాణము. చిన్నయ సూరి—"ఏకవాక్యంబునం దాకాంక్షం బొక్క సర్వ పదంబులు క్రమవిరహితంబుగం బ్రయోగింపంబడు," అన్న వాక్యము కేవలము పద్య రచయితమనసులో నుంచుకొని వ్రాసినది మాత్రమే. కాని ధ్వనివేత్తలు దీనిని గుణాపాదిగా చెప్పుదురు. వాడు వచ్చెను—అన్న వాక్యముకంటె వచ్చె వాడు— అన్న వాక్యములో రానే వచ్చెనను భావము వ్యంగ్యముగ వచ్చును. నన్నయాదినట్టు వచనములు పద్యములవలె నుండును. ఏనిని పద్యగంధివచనము లందురు. అట్టి వచనములు కొన్ని తేటగీతులుగనో, కందములుగనో ప్రస్తరింపవచ్చును. ఇవన్నియు ప్రయోజనములేని చేయునాయన్న విషయము శిల్ప సంబంధమైనది. మనకు ప్రస్తుతము కావలసినది ఛందస్సునకు సంబంధించినంతవరకు మాత్రమే. దీనినిబట్టి యొక భావము—ఒక పద్ధతి గల భాషలో పద్యముగా పోతపోసినపుడు మన కాహ్లాదము కల్గించుచున్నదని తేలుచున్నది. అనగా భావమునకు, భాషకును ఛందస్సునకును పరస్పర సంబంధ ముండియే తీరవలెనన్నమాట. వేమన పద్యము లంత ప్రాచుర్యము నందుటకు కారణము భావము భాష ఛందస్సు తగిన పాళ్ళలో కలియుటయే. లోకములో కొన్ని పద్యములే మిక్కిలి ప్రామఖ్యము నందుటకు కూడ నిదే కారణము. భావము భాష ఛందస్సుల సమైక్యము జరుగుటయే యాహ్లాదమునకు హేతువు. అది మానవప్రకృతిలో నున్నది. ఈ మూడు భావములను కూర్చినట్లుగ సర్వత వాడిన కవి సృష్టిలో నుండదు. మహాకవులైన వానియందు ఎక్కువ భాగమీ మూడిటి యొక్క సమైక్యము గోచరించు చుండును. కనుక భావమును ఛందస్సుచేత నుద్దీపింప జేసిన రచన యందు మనస్సు రమించినట్లుగా భావమును సూటిగా చెప్పిన వాని రచనయందు రమించదు.

అయితే గద్య వ్రాసిన దండి బాణుల విషయమేమిటి? పాశ్చాత్యభాషా సంప్రదాయము ప్రకారము కేవలము పద్య కవిత వ్రాసిన మిల్టన్, షేక్స్పియర్ మొదలైనవారే కవులు. కార్లైల్ మెకాలే మొదలైన వారు రచయితలు మాత్రమే. తెలుగులో కూడ పద్య రచయితలే కవులుగా పరిగణింపబడుచు వచ్చిరి. కాని సంస్కృత భాషా సంప్రదాయము దీనికి భిన్నమైనది. దానియందు కాళిదాసాదులవలె గద్య వ్రాసిన దండి బాణాదులు కూడ కవులే. "గద్యమ్ కవీనామ్ నికషమ్ వదన్తి" అన్న నానుడి కూడ నున్నది. అయితే కాళిదాసాదులను కవులన్న యుద్దేశ్యమునకును దండి బాణులను కవులన్న యుద్దేశ్యమునకును భేదమున్నది. దండి బాణుడు—ఏ పాత్రపోషణమో కథనమో చమత్కారముగా వ్రాయబట్టి కవులైరి. కాళిదాసాదులవలె ఛందస్సును వ్రాయుటచే కవులుగా పరిగణింపబడ లేదు.

వాల్మీకి కాళిదాస నన్నయాదులు ప్రసిద్ధ వస్తుమాత్రమైన యథార్థ భావము నుద్దీపింపజేయుటకే యా ఛందస్సును సృష్టించిరి. ఆ భావము లా ఛందస్సులచేతనే గాక వేరొక ఛందస్సులచే చెప్పిన రమ్యముగావని వారి యూహ. తరువాత నది క్రమముగా సల్లిపోజొచ్చెను. పద్యముల పోకడల మీద దృష్టి నిలచెను "శ్రవణసుఖమ్ముగా సామగానస్తులు చదివెడి ఋక్కుల చదువు పగిలి వినుచుండు కరులును" అని యొక ప్రయోజనము కొఱకు నిర్మింపబడిన నడక పోగిన కొలది తరువాతి కవుల చేతిలో నేక దర్శాలు పోయి "గగన కల్లోలినీ కల్లోల మాలికా హాల్లీ సకములతో నవఘటించి" "లలనాజనాపాంగ వలనా వసదనంగ తులనాభికాభంగ దో ప్రసంగ" యిట్లు మారిపోయినది.

సంఘము మతము ఆచారము మారినట్లే కవిత్వము మారినది. పాశ్చాత్యులు క్రొత్త మార్గములు కనిపెట్టిరి. కమ్యూనిజం వ్యాపించి పేదలు వర్గపోరాటములో పాల్గొనిరి. లోకములో సర్వసామ్య సిద్ధాంతము పొంగి పొరలెను. రాజుల కథలే వ్రాయుటయేమి? పేదల కథలు వ్రాయవలెనను సిద్ధాంతము బయలుదేరెను. పూర్వము పేదల కథలు వ్రాయక పోలేదు. అవి యంగములుగా గాక కేవల ముంగములుగ నున్నవి. ఆ కథ లంగులుగా వ్రాయవలెనని నవీనులూహించిరి. ఇట్లు వ్రాయుటకు ననుకటి ఛందస్సులు పనికిరావు. నూతనముగా ఛందస్సు నిర్మించవలెను. శ్రీశ్రీ దాని నిర్మాణములో కృతకృత్యుడైనాడు.

పూర్వకవులలో భావన క్రమముగా సన్నగిలవ మనసు ముహుర్ముహుర సంధానము చేతగాని భావము పదునెక్కదు. ఈ భావ పుట్టినది కాదు. ఏదో కళింగల పాతమువలె బుద్ధిని కాడితము చేయును. ఆ

కాదితమే యీ భావన యొక్క పరాకాష్ఠదశ. అట్లు భావము ఝుడితిగా తిరుగుటకు వీలుపు చాలని ఛందస్సు కావలెను. పూర్వపు ఛందస్సులలో భావము వివిధ విధముగా పోవుటకు చాలినంత స్థల మున్నది. అందుచే శ్రీశ్రీ తన భావనకనువుగా ఛందస్సులను సృష్టించుకొన్నాడు. కొన్ని యుద్రేక పూరితములైన భావములు చెప్పవలసివచ్చినపుడు శ్రీశ్రీ మొదటి యక్షరము లఘువుగా నుండి రెండవ యక్షరము గురువుగానున్న రచనలు ఎక్కువ చేయును. ఆ రెండవ యక్షరము విఱిగినపుడు భావము కూడ నుద్రేకమువై పునకు విఱుగును

"పదండి ముందుకు
పదండి త్రోసుకు
పదండి పోదాం
పైపైకి"

"పొలాలనన్నీ
హలాల దున్నీ
ఇలాతలంలో
హేమం పిండీ"

ఇవన్నీ దీని కుదాహరణములు.

శ్రీశ్రీ ఛందస్సంతయు లయాశ్రితము. మాత్రలు లెక్కపెట్టినచో కొన్ని కొన్ని చరణములకు తక్కు వగుచుండును. కావున లయాశ్రితముగా చూడవలసి నదే కాని మాత్రల ప్రకారము చూడదగదు. పూర్వు లైన నన్నయాదులు ఛందస్సును ప్రస్తరించి యే ఛందస్సు ఏ భావము నిముడ్చుకొనునో యూహించి రచన చేసిరి. శ్రీశ్రీ యట్లు చేయలేదు. తనలో నే యుద్రేకము పొంగినదానినే వ్రాసి యది యొక ఛందస్సుగా జూపినాడు. కావున నైన చెప్పిన మార్గమునకు దీనికి భేదమున్నది. లయాశ్రితమైన ఛందస్సులో భావము వ్యక్తమగుచే కాని తద్వ్యా ఖ్యాదికము వ్యక్తము గాదు. పూర్వకవులలోని భావము రసన — చర్వణ — ఆస్వాదనలద్వారా భాసించును. ఈ కవిలో భావమట్లు భాసించదు. పూర్వ ఛందస్సులు భావమును సంస్కరించును. ఈ కవిలో భావమే ఛందస్సుగా మారును గాన దాని కాస్కార మండదు

లయ తప్పినచో నితని కవిత్వమే లేదు.

"ఆ అవ్వే మరణిస్తే
ఆ పాపం ఎవ్వరిదని
వెఱ్ఱిగాలి ప్రశ్నిస్తూ
పఱిపోయింది!"

ఇందులో నాల్గవ పాదము మాత్రలు తక్కువైనను లయకు సరిపడును. వెనుకటి జానపదగీతము లన్నియు నీ లయ నాశ్రయించి వ్రాయబడినవే. కవి యుద్రేకము కొలది ప్రతిభనుబట్టి యనేక భావములు ఛందస్సులుగా తిరుగును. ఇవి పూర్వకవులలోని వానివలె సంస్కృతములు గావు. అట్లు సంస్కృతము గావలసిన యగత్యమును దీనికి లేదు. ఉదాత్తమైన భావము సంస్కరింపబడి యంత భాసించునో అనుదాత్తమైన భావము సంస్కారాభావముచే నంతగా భాసించును. ఏ గుణమో — వృత్తియో — రీతియో దీని నుద్దీపనము చేయుటకు సాధించిన జాలును. ఈ పరమసత్యము తెలిసికొని క్రొత్త మార్గము త్రొక్కిన కవి శ్రీశ్రీ.

ఈ కవిలోని ప్రధాన వస్తువు పీడిత ప్రజ. ధని కుల పన్నాగములకు చిక్కి విశీర్ణమైపోవుచున్న పేద ప్రజల జీవితమంతయు వ్యక్తము చేయబడినది.

"అంతేలే, పేదల బ్రతుకులు!
తిరిపెమునకు పిడికెడు మెతుకులు!
తెరువెరుగని దీర్ఘరాత్రిలో
తల పగిలేటి తలపుల గతుకులు!"

ఇట్టివి హృదయము నెంతేని కదలించున వెన్నేని యుదాహరణములు చూపవచ్చును కాని దానిని పాటుగా దీనికొని సంస్కృతిని విమర్శింప బూనుదు. ఆ విమర్శనలో నుదాత్తత యుండెను. హేతువులేని వ్యర్థవినిగమనములతో నితని సిద్ధాంతము భావించుట కవికి నచ్చని ప్రతిదానిని విమర్శింపవచ్చును కాని యా విమర్శ పరిశుద్ధముగా నుండవలెను. గాలిమాటల ప్రోవువలె నుండగూడదు. అది కాక మతము, — సంస్కృతి, — సినిమిషయములో నవేమియో తెలిసికొనకుండ విమర్శించుట సుతరామూ పనికిరాదు. ఒకవేళ విమర్శించినచో సిద్ధాంతము తర్కసహముగా నుండవలెను.

"ఇవిగాంధారు రోల్స్కారు
మాయంటావా? బాబూ
ఏమంటావు?"

ఇదిమిథ్యావాది యను ఖండికలోనిది. వేదాంతులు సత్యమును రెండు విధములుగా చెప్పుదురు (1) పారమార్థికమైనది (2) వ్యావహారికమైనది. పారమార్థికమైన సత్యముగానిది మిథ్యయని వారి సిద్ధాంతము. అది వ్యావహారికమైన సత్యమని వారే యొప్పుకొందురు. జమీందారులోల్ప్ కారు మాయ యన్నచోనది పారమార్థికమైన సత్యముగాదని వారి భావము. మిథ్యావాదిని విమర్శించు మార్గమే యిది కాదు. తెంగాపటువులు కొని పాతకులకు మిథ్యావాదమన్నచో నిజముగా నిదియే యని స్ఫురించును. ఇట్టివానిని ప్రత్యాఖ్యానము లందురు. ఈ ప్రత్యాఖ్యానములలో నిజమే సని భ్రమగొల్పు లక్షణమున్నది. మనుచరిత్రలో "ఆనంకో బ్రహ్మయటన్న ప్రాజ్ఞులు సంతర్ఫ్బద్ధి నూహింపుమా" యని యున్నది. అసలిది యుపనిషత్తులలోనిది. అక్కడ యానంద మనకొట్టికో నిర్వచించి యది బ్రహ్మయని చెప్పబడినది. వరూథిని తన కనుకూలముగా నానందమునకు లౌకికమైన యానందమును భ్రమ గల్పించినది. ఇట్టివి సంస్కర్త యొక్క గొప్ప లక్షణములను కించపరచును. మిథ్యావాదమును పరిపుష్టముగా తర్కసహాయముగా నిరూపించినచో నీ చిక్కుండదు.

ఇక నీ కవి కవితాసిద్ధాంతములు కొన్ని యీ విధములుగనే యుండును

"కదలేదీ కదలించేదీ
మారేదీ మార్పించేదీ
పాడేదీ పాడించేదీ

కావాలోయ్ నవకవనానికి"

దీని నందరు నొప్పుకొందురు. ఎవ్వరును కాదనరు. ఈకవి "కవితా! ఓ కవితా!" యను కృతికలో కొన్ని సిద్ధాంతములు చేసినాడు. పూర్వకవిత్వమంతయు చటులాలంకారపు పటలలో చిక్కుకొని రూపమే కానరాకపోవుటచే నీయన దీక్ష పట్టగా క్రొత్తమార్గము స్ఫురించినదట. అది శ్మశానముల లాంటి నిఘంటువులదాటి, ఛందస్సుల సర్పపరిష్వంగము వదలించుకొనిన మార్గము. పూర్వకవు లనగా బహుశః ప్రబంధకవులని యితని యుద్దేశ్యము. వారెవ్వరు నీ కవికంటె యెక్కువగా చటులాలంకారములలో భావమును బంధింపలేదు. వ్యర్థపదములందలి కవిత్వములో నుండును. ఒక్కని కవిత్వమేమిటి—శబ్దము ప్రధానముగా వ్రాయు ప్రతి కవిలో నున్నది శ్రీశ్రీ లోగూడ నున్నది. శ్రీశ్రీ వాడిన శబ్దాలంకారములలో నున్న సార్థకత్వము ప్రబంధకవులలో లేక పోలేదు. కేవలము పద్యరచనవిషయములో వారి కవిత్వమందలికిని శిరోధార్యము. అంత మధురముగా పద్యరచన చేయువా రితర భాషలలోనైన చాల తక్కువ. శ్రీశ్రీ "ఐ" యను ఖండికలో

"లోకాల,
భవభూతి శ్లోకాల,
పరమేష్ఠి జూకాల నామహోగ్రకాలం!"

అంత్యప్రాసకొఱకు కవి ప్రయత్నము చేసిన ట్లగుపించుటలేదా! జూకాలు సాధారణముగా స్త్రీలు ధరించుకొందురు. కాని యిక్కడ ప్రాసనియమముకొఱకు పరమేష్ఠి ధరించుకొన్నాడు. అంతమాత్రముచేత పెద్ద తప్పని నా భావము కాదు. శబ్దముపై మమకారము లోకములో సహజము.

ఇక నిఘంటువులు శ్మశానము లనుట యేమి? ఈయన నిఘంటువులలో లేని పదములు వాడునా! ఒకవేళ యీయన సాహసించి వాడినను—అది యెవరి కర్థమగును? అది యొక క్రొత్తభాష యగునే కాని ఈ కవిభావము క్రొత్త క్రొత్త మార్గములను నిర్మించుట యని యేని లక్షణయా గ్రహించుటయో—ఏదో విధముగ సరిపుచ్చుకొనుటయో చేయనిదే యీ కవిత్వ మర్థమే కాదు. మరియు "ఛందస్సుల సర్పపరిష్వంగం వదలి" అని వ్రాసినాడు. ఛందస్సుల ప్రయోజన మీకవికి తెలియక యిట్లు వ్రాసినాడా! ఛందస్సు భావమును సంస్కరించును గాని బంధించదు.

శ్రీశ్రీ కవిత్వములో మరుగుకొన్నను కొన్ని వేదాంతభావములు నుండును. కాని ప్రస్ఫుటపడిన వనుకొన్న క్రొత్తాస్త్రాలు—హోరోంకారహారలు—నాదబ్రహ్మలే తనకు కావలసివచ్చెనని "ఆకాశదీపం" అను ఖండమంతయు వేదాంతము వాసన కొట్టుచున్నది. చచ్చిపోయిన మహాపురుషులు ఆకాశమందు నక్షత్రము లగుదురని లోకములో నమ్మకము గలదు. ఆ నమ్మకమే యీ ఖండములోని భావమున కాధారము.

"ఒక దురదృష్టజీవి
ఉదయం అరుణ్మరథు

ఆ గదిలోనే ఆరిపోయాడు
అతని దీపం ఆగదిలో
నాలుగొక్క మూలుగుతున్నది

దీపం ఆరిపోయింది
తారగా మారిపోయింది "

ఈభావము వేదాంతమునకు సంబంధించినదే

తరువాతి "గంటలు" అను ఖండము పేర్కొనవలసినది. ఈ ఖండము విభిన్న విషయములైన ధ్వనులను వివిధ్యముగా చెప్పను స్పష్టియందరియు ధ్వనిమయమని ఓంభావము లోకమంతయూ శబ్దమయమను వాదనలో దీనికి మూలమునుకొందును. అందు చేతనే —

"ప్రాణము ప్రాణ ప్రతిష్ఠలములో,
నీహృదయములో, నాహృదయములో
గంటలు! గంటలు!
గంటలు! గంటలు!"

అని కవి చెప్పినాడు గణ గణ గణ గణ యని పునరుక్తి చేయుటచే నాశబ్దము యొక్క యనంతత్వము సూచింపబడుచున్నది

"గర్వతిల నీరింకిన
చెరువుపక్క, చెట్టునీడ -
గోవెలతో, కుంపటలతో,
ఏలుతూ స్తే అలు చీకటి"

చీకటి గోతాలతో కుంపటలతో నున్నదట ఇట్టి రచనలు కొన్ని యీ కవిత్వము నా కోశపథమున కెక్కుచున్నవి కవిని రచనా గౌరవమునుబట్టి మెచ్చుకొనవలయును అతని వ్యక్తిగత భావములకు ప్రాధాన్య మిచ్చు సిద్ధాంతము కవిలో నున్నదని మహాకవి యనరాదు సిద్ధాంతములందరికి నుండును అవి వ్యక్తము చేయు రచనాశిల్పమే కవిని సామాన్యమానవుని కంటె భిన్నునిగా పరిగణింప జేయును కాబట్టి కవినిగురించి చెప్పుట యన్న యీ రచనాశక్తిని గురించి చెప్పుటయే రచనాశక్తి తెలియక సిద్ధాంతములనుబట్టి మెచ్చుకొనవారికంటె రచనాశక్తినిపరామర్శించి వ్రాయగలవారివల్లనే కవి కావ్యమునకు కొంతయైనను లాభముగల్గునని నా భావము

శ్రీ శ్రీ కవిత్వమందఱకు నర్థమగునని కొందఱి యూహ. శ్రీ శ్రీ అన్ని పదములు లక్షణయా చెప్పకొనవలసినదే కాని వాని వాక్యార్థముల కొసాక్షాత్కారముండదు శ్రీ శ్రీ కవిత్వముకంటె పూర్వకవిత్వమే చప్పున స్ఫురించును అందర్థగతికి సాంకేతికములైన పదములు ప్రసిద్ధములు, సంప్రదాయబద్ధములైయున్నవి అయితే శ్రీశ్రీ లో ప్రతిపదము తెలియకపోయినను మొత్తముమీద తాత్పర్యము తెలియు ననవచ్చును ఆ తాత్పర్య మన్ని కవిత్వములలోను తెలియుచునే యుండును ఈ క్రింది పద్యము నాచన సోముని యుత్తర హరివంశములోనిది

"హరివంశద్విప దంతికుంభి కఖరా
ఘాంకార నిర్భిన్న గ
ద్గరగాఢాంకిత వజ్రవిస్ఫురిత వి
ద్యాభ్యాసైక రోమగ్న్యు
స్థిరవిద్యు త్ప్రతిపత్తివత్తుపెయి వ
స్పష్ట స్థాన లేయుండు భా
స్వరబింబ ప్రతిబింబ మంబరము ప్రిం
గ ద్వ్యాప్త చందంబునన్ "

ఈ పద్యములో సుకుమారమగు భావ మందరికి తెలియుచున్నది కదా ఆ సమాసముల కర్థము తెలియకపోవచ్చును

"సింధూరం, రక్తచందనం,
బంధూకం, సంధ్యారాగం

రుద్రాలీనయన జ్వాలిక
కలకత్తా కాళికనాలిక
కావలసిన నవ కవనానికి"

"కవీ! నీ గళగళన్మంగళ
కళాకాహళ హళహళిలో
కలసిపోతిని! కరగిపోతిని!
కావలెనే కదలిపోతిని!"

ఇవి తెలిసికొంతమాత్రము గా నీ పద్యము తెలియకపోదు. ఏ కవిత్వమైనను తాత్పర్యమాత్రముగానే పాఠకులకు తెలియును దానియందలి విశిష్టలక్షణము లన్నియు విజ్ఞులకు తెలియవలసినదే శ్రీశ్రీ చెప్పినట్లుగా పుష్కిన్, గోగల్, డాస్టవిస్కీ ప్రసిద్ధ శిల్పనిర్మాణదక్షులు వారు కథలు చెప్పు లక్షణములే విశిష్టములు వారి కథలు గూడ పాఠకులకు తాత్పర్య మాత్రముగానే తెలియును. తద్రచనాశిల్పము తెలి

డుదు వారినిగురించి వ్రాసెడి చేటి ప్రతి విమర్శకుడు వారు ప్రజాజీవితమును వాస్తవికముగ జిత్రించిరని చెప్పవచ్చే కాని వారి ప్రతిభలోని విశేషములు వివరించడు శిల్పము వారిచేతిలో విస్మరింపబడి. ఆడెన్, ఇలియట్ మొదలైన కవులలోని శిల్పసంస్కార మీ కవి కవిత్వములో గనుపించదు ఎంతసేపటికి ఛందస్సుల వైఖరి మాత్రమే పోలికగా భాసించు చుండును

సంఘములో మానసికముగా డెబ్బతిన్న విచారము శ్రీశ్రీ లో పలుచోట్ల గోచరించును అందుకే

"అలజడి మా జీవితం
ఆందోళన మా ఊపిరి
తిరుగుబాటు మా వేదాంతం"

"ఒక వ్యక్తిని మరొక్క వ్యక్తి
ఒక జాతిని వేరొక జాతి,
పీడించే సాంఘికధర్మం
ఇంకానా? ఇకపై సాగదు"

అన్నాడు ఇవన్నియు వినువారు లేరు వారందరది ప్రపంచకులు ఈ సృష్టిలో మోసమే ప్రధానాంశము "గాలిలో కనరాని గగన సుదర్శ్యాలు గూఢవంబుల మస్య యీడుచున్నాయట"

"మానవుడా" అన్న గీతంలో మానవుని యనేక విధములుగా సంబోధించును అది మానవతాపైవిన్యాసము సూచించుట కేర్పఱుచుకొన్న పద్ధతి

ఈ కవిలో *Surrealism* (అధివాస్తవికకవిత) యొక్క *Influence* చాల తక్కువ దానిమీద మమకార మున్నదే కాని దానిని కావ్యగుణం దిముడించ లేదు

ఈ కవి సంస్కృతము సెక్షుగా వాడినను తప్పులు రావు "వగ్నకాగ్రముల—"ప్రాంతరాల" —ఇవి సాధువులు కావు వార్షుకాగ్రములు—ప్రాంతములు—అనవలె ననుకొందును ఇట్టిచోటెపాదిగిట" యని యాపవిత్రకముగా వాడినాడు ఇట్లు వాడ కూడదు ఈ గ్రంథముపేరు మహాప్రస్థానము ఇక్కడ దీర్ఘప్రయాణ మనగా మరణమని యర్థము వచ్చును గొప్ప బాట యని యర్థము వచ్చుట కంతగా వాస్తార ముండదు ఇవన్నియు కవి ప్రతిభను కళంకించకలసిన దోషములు కావు

"అంతరాయ యింతయో తెలిసినట్టి
విమర్శకులైన కావ్యసి
ద్ధాంతుల యుత్తిసింబడి మహాకవి
నాగటిచాలు దీర్ఘ్యగా
లాంతరకీర్తి వ్యష్టిగతమై చను
లాభము సెందుచునా లలా
ఎంతసరూపు చింతినవట
స్మగుభారతి సస్యధారణిన్"

ఇది విశ్వనాథ సత్యనారాయణగారి రామాయణకారికలోని పద్యము ఏ కొంచెమో తెలిసిన కావ్యసిద్ధాంతి యుత్తినిచే మహాకవి నాగటిచాలు తీర్చిపెట్టును కావ్యసిద్ధాంతులచే బరామృష్టము గానిదే కావ్యము భాసించదు కవి యిట్లు కష్టించి సాధించుటవలన ప్రయోజనమేమి? తరువాత జనులు తన్ను కీర్తింతురను నాశచేత మాత్రమే అందుకే కాళిదాసుకూడ "బలవదపి శిక్షితానా మాత్మన్యప్రత్యయమ్ చేతః" అన్నాడ లోకములో చేదో పేరుకొఱకు ప్రాకులాడువారి కేమియు నవసరము లేదు వారు కవులే కానవసరములేదు కొన్ని పట్టుబడి పదములు చాలును

శ్రీ శ్రీ మహాకవి కాకపోయినను నొక పద్ధతికి మార్గదర్శియైన కవి ఆ కవిత్వము బహు విమర్శలచేత గాని భాసించదు మేధాపటువులైన విమర్శకులు కవి ప్రతిభలో నిమిడిన విశేషములను బైటపెట్టవలెను పూర్వకవులందఱు నట్లే నిలచిరి

---

# భారతనారి



శ్రీమతి వట్టికొండ విశాలాక్షి

(గత సంచిక తరువాయి)

ఏమిటది? అంటూ అట్టలిప్పి పుస్తకం నాముఖం ముందు పెట్టారు సత్యం, పేరుకింద అదే పేరు ఏడెనిమిదిసార్లు పెన్సిలుతో వ్రాసిఉన్నది అది చూసేటప్పటికి నాకు అయోమయమైపోయింది అది అవినంగా ఎవరు వ్రాశారో ఎలా వ్రాశారో ఎందుకువ్రాశారోకూడా నాకు బోధపడలేదు ఏమి సమాధానం చెప్పటానికి ఏమీతోచలేదు మాన్తా నిలబడ్డాను

ఏం చెప్పవేం? అంటూ కాలిచెప్పు విసిరారు

'మీకోక నమస్కారం నన్ను చంపకోకండి, మీకుఇష్టంలేకపోతే వదిలైవేయ్యండి ఇదిమాత్రం నేను వ్రాయలేదు నా దస్తూరీ అవునో కాదో కావలిస్తే పరీక్ష చేసుకోండి అంతేకాని అనవసరంగా నన్ను అవమానించకండి ఇవన్నీ నామీద ఎందుకు ఇలా కొట్టుకొస్తున్నవో నాకేంఅర్థంకావటల్లా' అన్నాను నేనుమాట్లాడిన మాట ఒక్కటికూడా వారిచెవిలో దూరివుండదు ఆ పరిస్థితుల్లో మానవత్వాన్ని కోల్పోయిన వ్యక్తి ఎలా ప్రవర్తిస్తాడో అదే మోస్తరుగా ప్రవర్తించారు నీవీమరునిమిషానికే ప్రయాణం కట్టవలసిందేనని చెప్పారు అంతలో మా అత్తగారు వచ్చారు మొగుడు కొట్టినందుకుగాదు తోడికోడలు తొంగిచూచినందుకని ఒక సామెతున్నది చూడండి అలాగే ఆమెకెక్కడ తెలిసిపోతుందోనని చాటుచాటుగా కళ్లుతుడుచుకొని గదిలోనుంచి బయటకువచ్చాను

వాడు వచ్చాడట్టుందేం? అన్నదామె నాతో,

ఊఁ, అన్నాను

'అప్పుడే వచ్చావేం? ఇంకాఏమున్నా ఉన్నట్యోహే గాలించుకు పోదామని వచ్చావా? నువ్వీ వరసన పూళ్లమీద తిరుగుతుంటే నీ యింటికి నీ పెళ్లానికి కావలసినున్నావా ఇక్కడ నేను? నువ్వు పూళ్లెంబడి తిరుగుతూవుంటే నామాట వింటారా పెద్దారా?

నీకేం తెలుస్తుంది? ఎట్లాగొట్లా ఆ ముసల్దే చస్తది తెమ్మనుకుంటావు ఇప్పటికి అరవై ఏళ్లు వచ్చినైనాకు ఇంత పసిపిల్లల్ని దగ్గరకూర్చోపెట్టుకుని ప్రొద్దుపుచ్చుకొనే రోజుల్లో ఆ గీతలేకపోగా అది లేదని ఇదిలేదని ఇంట్లోనాటికోసమే దేవుళ్లాడాల్సొస్తోంది బతుకంతా ఇంకెప్పుడు నన్ను నవ్వు సుకపెట్టేది? ఆ గోలెందుకురా నువ్వు తీసుకుపోయింది? ఈ తిసేముద్దకూడా పడిపోటానికా? నీమచ్చమాయ' అని అంటున్నదామె

'ఆహాఁ ఇక చాల్లే ఆ ఉపన్యాసం కట్టిపెట్టు అంతటితో నువ్వు నాయిల్లుమాడద్దు, ఎవర్నీ చూడద్దులే' - అంటూ వాకిట్లోకి లేచిపోయారు కావేపట్లో వాకిటముందు బండి నిలబడిఉన్నది

మళ్లీ బండెక్కడికిరా అన్నదామె వారు నావైపు చూచిపెట్టే గిట్టా సర్దుకున్నావా అన్నారు.

పెట్టెక్కడికి అన్నదామె రాగంతీస్తూ

అదుగో బండివాడు వస్తున్నాడు నీ పెట్టె ఇచ్చేసెయ్యి - అన్నారు

ఎక్కడికి అన్నదామె మళ్లీ నాతో ఇంటికన్నాను

ఇంటికా? ఏమిరా? మొన్నటిదాకా నువ్వు తిరిగొచ్చావు మళ్లీ దాన్ని తిప్పుకోతున్నావా? నేను చెయ్యలేనయ్యా మీ యిద్దరం ఇంకెందుకు నేను పోతా ఎటోఅటూ అన్నదామె నేనలాగే నిలబడున్నాను ద్వారబంధాని కానుకొని

'మళ్లీ తగలాలా? ఎన్నిసార్లు చెప్పాల బండెక్కమని?' అన్నారువారు. నాకళ్ళంబడి నీళ్లు బొటబొట కారుతున్నవి. పెట్టె బండివాని కివ్వటానికి సర్దుకున్నాను.

ఏమిట్రా ఏమిటి? అన్నదామె ఆదుర్దాగా

ఏమీలేదు. దీన్నసలు మనింట్లో ఒక్క నిముషంకూడా ఉండనివ్వకూడదు. అని అంటున్నారు వారు నాకు ఇష్టంలేని పనిచేయవలసి వస్తున్నందుకు దుఃఖం పొర్లుకొచ్చి అవురుమన్నారు

'ఒక ఒక్కదాన్నే పంపిస్తే మనల్ని మాత్రం నవ్వరట్రా? ఏదన్నా తప్పంటే వాళ్లనాన్నను పిలవనంపిస్తే వాళ్లే చూసుకుంటారు నేనుంటేని గాయ్యి పెద్దముండ అదన్నా చెప్పకూడదా అనుకుంటారు ఇదిచేసేది లోకానికేం తెలుస్తుందంటా' అని అంటూ వున్నదామె పెట్టె పట్టి గదివాకిట్లో నిలబడ్డాను నేను వారు పెట్టె బండివాడిచేతికిస్తున్నారు నేనొకసారి మా అత్తగారి ముఖంవైపు చూచాను జాలిగా

'నన్నేం చెయ్యమంటావమ్మా? చూస్తూనే వుంటివిగా నా మాట వాడువింటాడు గనకనా పెడ్తాడు గనకనా? మీలోమీరు ఏమనుకొంటున్నారో ఏంజేసుకొంటున్నారో నాకేం తెలుసమ్మా? నాకేవంటే వాడికంటే మూడాకులు నువ్వు ఎక్కువ చదివావని ఇవాళనుకుంటారు రేపూ అనుకుంటారు ఎటుతిరిగీ మీరుమీరు ఒకటేనమ్మా, నేనేతేడా అవుతాగాని' అన్నదామె ఎక్కవేం బండి - అని ఒక్కకేకవేశారు ఇక నాకు ఎక్కడలేని ధైర్యం వచ్చింది ఛీ అక్కరలేని వాళ్లతో ఎందాకా అతుకు పెట్టుకుంటాం? ఏదైతేమాత్రమేమి? ఏ సమయానికి ఏది చేయవలసివస్తే అదల్లా ధైర్యంతోనే చేసితీరాలనుకొంటూ బండి ఎక్కాను పరిష్కారంచేయలేని కొన్ని కొన్ని సమస్యలనుగురించి తీవ్రంగా ఆలోచించుకొనేకాని తెలియక, వాటంతటవేపరిష్కారమౌతాయనుకొన్నానప్పుడు అంతటితో నా విషాద జీవితంలోని ఒకభాగం సమాప్తమైంది

నేను మా పుట్టింటికి వచ్చినతరువాత ఎన్నడు మాయింటికి రానివాళ్లుకూడా ఏదో ఒక వంకపెట్టుకుని మాయింటికి వస్తూండేవాళ్లు అట్లా-చిక్కిపోయావేం? ఏమన్నా జబ్బుచేసిందా? అనీ, మీఅన్నయ్య అత్తగారింటిదగ్గర ఉన్నాడు కాబోలు, ఎవరు తీసుకొచ్చారని, ఒక నెలవుంటావా, తొందరగానే వెళ్లాలా? అనీ ఇలా ప్రశ్నలమీద ప్రశ్నలు కురిపించేవాళ్లు అసలు విషయం వాళ్ళకు తెలియక కాదు నేనే విధంగా చెప్తామనని. మా నోటి మీదగా చెప్పించి వినాలనీ, అలాంటి ప్రశ్నలతో మమ్మల్ని అవమానయా బాధిస్తూండేవాళ్లు ఇక్కడకు వచ్చిన కొత్తరోజుల్లో మొగుడుకొట్టి వెళ్ళగొట్టాడట, అనీ, దీని వ్యవహారం మొగుడికి తెలిసి అట్లాచేశాడట అనీ చాటు చాటుగా ప్రచారం చేస్తూనే వుండేవాళ్లు—అలాంటి వ్యవహారాలలో ఆరితేరినవాళ్లు కొంతమంది నన్ను బాగా ఎరిగున్నవాళ్లు ఇప్పుడేకాదు అప్పుడుకూడా నామీద మాట పడనిచ్చేవాళ్లు కాదు

నేనసలు ఇల్లువదలి పడిపంచలు చేరవలసి రావటం సత్యం నెపంతోనేకదా తన కారణంవల్ల నేనీ విధంగా కావటాన సత్యం ఎంత బాధపడుతుంటాడు బాధపడడుమరీ? సత్యానికి నాకువున్న పరిచయం తెలిస్తే సత్యమేకాదు హృదయంవున్న వాళ్లెవళ్లైనా బాధపడి తీరవలసిందే.

సత్యము నేను చిన్నప్పటినుంచి ఒకేస్కూల్లో చదువుకుంటుండేవాళ్లం వాళ్లతోపాటు ఇంకాకొంత మంది ఆడపిల్లలుకూడా వుండేవాళ్లు ఆ స్కూల్లో ఏకారణాలవల్లనోకాని సత్యం మా అందరికంటే పెద్దవాడైనప్పటికీ చేరీచేరటమే మా క్లాసులోనే చేరాడు మాఅందరిలో సత్యం ఇముడలేకపోయాడు. మాకు ఆలస్యంగాను సత్యానికిత్వరగాను పాఠాలు వస్తుండేవి చివరకు ఆయనకు వేరేక్లాసుపెట్టి చదువు చెప్పవలసివచ్చేది మిగిలిన మా అందరిలోకీ మళ్లీ నాకు త్వరగా పాఠాలు వస్తుండేవి ఎప్పుడైనా మేస్టరుగారు మాక్లాసుకి సత్యాన్ని పాఠాలు చెప్పమనేవారు వాళ్లందరికీ చెప్పబోయి వాళ్లకు త్వరగా రాకపోవటాన విసుక్కుంటుండేవాడు నాకు చెప్పటం అంటే సరి చాలా సరదాగా చెప్పేవాడు చదువుకునేటప్పుడు ఎక్కువగా మేమిద్దరమే జంటగా తిరుగుతుండేవాళ్లం మా యిల్లు వారియిల్లు దగ్గరగానేవుండేవి పైగా ఎక్కడో ఏదోకొంచెం బంధుత్వంకూడా కలిసివున్నదని పెద్దవాళ్లు చెప్తుంటారు ఈ కారణాలవల్ల సత్యానికి ఫలానా వారమ్మాయినిచ్చి చేస్తారట అనిజనం అనవసరంగా వాదుకలు పుట్టించారు అప్పటికి నాకంతగా ఏమీ తెలియదు సత్యానికిమాత్రం బాగా ఏమీకాని కొంతవరకైనా తెలిసే వుండవచ్చు నాకుతెలిసిం

వల్లా సత్యానికి బాగా పాఠాలు వస్తాయనీ, నాకంటే సరదాగా పాఠాలుచెప్తాడనీ, ఏదైనా తెచ్చిపెట్టమంటేసరి నాకోసం ఎంతకష్టపడైనాసరే తప్పకుండా తెచ్చిపెడతాడనీ, అంతవరకుమాత్రం తెలుసు స్కూల్లో తిరిమ్మ పిల్లలంతా అబద్ధాలాడుతుంటే వాళ్లేకాని సత్యంమాత్రం అబద్ధం ఆడడనీ, సత్యం సత్యమేననీ ఇదొక వాడుక కూడా

అప్పుడు సత్యంఅంటే నాకుచాలాఇష్టంగానే వుండేది తరువాత నేనుకొంచెం ఎదుగుతున్నకొలదీ సత్యం సహవాసానికి మావాళ్లు నన్ను పోనిచ్చేవాళ్లు కాదు మాపెద్దవాళ్లు వాళ్లపెద్దవాళ్లుకూడా బాగానే వుంటుండేవాళ్లు ఘనానావారమ్మాయిని సత్యానికి ఇచ్చి పెళ్లిచేస్తారట అని జనం చెప్పుకుంటూనే వుండేవాళ్లు జనం ఆవిసంగా చెప్పుకోగా చెప్పుకోగాచివరకు మా పెద్దవాళ్ళకుకూడా ఆ ఉద్దేశాలే కలిగినవి అంతలోనే నేను పెద్దదాన్నయాను

అంతకుముందే సత్యం చెబుతుండేవాడు ఇంకా కొద్దికాలానికి నిన్ను మీవాళ్లు చదువు మాన్పించటానికి ప్రయత్నించవచ్చు నీవు మాత్రం చదువుకో వలసినదేనని పట్టు పట్టుమని ఆయన చెప్పినట్లే ఇకస్కూలుకు పోవద్దన్నారు మావాళ్లు నేను పట్టు పట్టాను కాని లాభం లేకపోయింది నేను పెద్దదాననైన తరువాతకూడా సత్యం ఏదైనా పనిమీద మా యింటికి వస్తూవుండేవాడు మొదట మొదట సత్యానికి చాటుకు పోవాలో ఎదుట వుండాలో తెలిసేదికాదు నాలో ఏదోఒక కొత్తదనం రావటాన ఎదుటవుండటానికి సిగ్గుగా వుండేది నిన్నమొన్నటివరకు కలసిమెలసి తిరుగుతూ ఒక్కసారి చాటుకు పోయినా ఏమనుకొంటాడోనని వుండేది నాకు తెలియకుండానే రెండుపనులు చేస్తూనే వుండేదాన్ని సత్యంవచ్చినా మా అమ్మతోనో మా నాన్నతోనో మాట్లాడి పోయేవాడుకాని నాతో ఏమంత ఎక్కువగా మాట్లాడేవాడే కాదు

ఒక్క నాడుమాత్రం చేతిరుమాలమీద చిన్నచిలక కుట్టుకుంటున్నాను నా దగ్గర సరీగా అలాంటిదే ఒకటివున్నది కాని సాదాగావుంటుంది, అదినీవు తీసుకుని ఇదినాకు ఇస్తావా అన్నాడు. అలాగే ఇస్తానన్నాను, ఒకసారి తనేమో కథ వ్రాశానని, ఆకథ ఫెయిర్ చేసి పెట్టమని అడిగాడు. అలాగేచేసి పెట్టాను అలాఆయన నాకేదైనా చిన్న చిన్న పనులు చెపుతుండటం నేను చేసిపెడుతుండటం అలవాటైపోయి ఎప్పుడుఏది చెప్పినా సరేలెమ్మంటుండే దాన్ని, ఒక్కసారి కాబోలు అన్నాడు నేను ఇప్పుడు ఏది చెప్పినా ఒక్కసారైన చెయ్యనంటావేమో అంటే అనవేమి? అని చెయ్యనని ఎందుకనాలి అన్నాను

కాదు సాధారణంగా ఇతరులు ఎప్పుడు ఏదో ఒకపని చెపుతూవుంటే విసుగ్గాఉండదుమరి? అనే వారు నాకు అలావుండదని చెప్పేదాన్ని నిజంగా నాకు ఇంట్లో పనులకంటే సత్యమేదైనా పని చెప్తే ఎంతో సరదాగా చేసిపెట్టబుద్ధయేది నాకలా వుండటానికి ఆశక్తి ఆయనలోనే ఏదోవున్నది నేను అలాగే ఆయన ఏబస్తీకన్నా వెళ్తున్నారని తెలిస్తే సరి గాజులనీ, రిబ్బన్లనీ, ఏవేవోపనులు పురమాయించేదాన్ని ఆయన ఒక్కటికూడా మరచిపోకుండా తెచ్చిపెట్టేవాడు అలా ఇద్దరం పూర్వంలాగానే స్నేహంగా వుంటుండేవాళ్లం తరువాత సత్యానికి వున్నఆస్తి కాస్తా వ్యాజ్యంలో చిక్కుకుపోయింది అది అప్పట్లో తేలేటట్లుగాకూడా లేదు అందువల్ల నన్ను ఎక్కడైనా వేరేఇచ్చి వివాహం చేస్తే బాగుంటుందని మావాళ్లు ఆలోచించటం మొదలు పెట్టారు అప్పటినుండీ, ఎప్పుడో ఏమోకాని సత్యం మా యింటికిరావటం మానివేశాడు నాకు వేరే సంబంధాలు రావటం ప్రారంభించాయి నిజంగా నాకే సంబంధం ఎంతమాత్రం ఇష్టంలేదు. అయినా మానాన్నముందు మావాళ్ళ పనిపిల్లకూడా ఎదురుచెప్పే వీలులేదు నాకువచ్చిన సంబంధాల్లో ఇంత నిక్షేపంలాంటి సంబంధాన్ని మావాళ్లు ఖాయం చేశారు

తరువాత రెండుమూడు రోజులకే నన్ను పెళ్లికూతుర్ని చేశారు. నాకు పెళ్లికళరాలేదనీ, నాకీసంబంధంఇష్టంలేకపోవటానికి కారణం సత్యానికి నాకు ఏదో ఉండిఉంటుందనీ, అమ్మలక్కలంతా అప్పుడే చెప్పుకోవటం ప్రారంభించారట అదే అలాఅల్లుకుని అలా అల్లుకుని మా అత్తగారు మా వారివరకు కూడా పాకింది అదుగోపులి అంటే ఇదుగోతోక అనేవాళ్లేకాని అసలక్కడ పులివున్నదో లేదో కాస్త ఆలోచించి తెల్సుకోగల విజ్ఞానం మనలో

ఎంతముందిఉన్నదీ? వాళ్లవీళ్ల మాటలునమ్మి మావారు, ఎలాగైనా పిల్లా జల్లా కలిగేటట్లుగాలేరు, పైగా సొమ్ముకూడా రాలేదని దీన్ని వెళ్ళగొట్టి ఇంకొక దాన్ని తెచ్చుకుంటే బాగా కట్నకొస్తుందని మా అత్తగారూ, ఇద్దరు ఏకమై నన్నీ విధంగా చేశారు ఎవరైనా అదేమని అడిగితే ఒక్కపనన్నా ఒళ్లువంచి చేసిచేకాదనీ, చెప్పినట్లుగా వినేదికాదనీ, ఎదురు తిరిగి ఏది పడితే అదిఅంటుందనీ, అలాంటి దానితో మేమెట్లా కాపురం చేయించుకుంటామని చెపుతుంటేవాళ్లు నేను ఇక్కడుకు వచ్చినకొత్తలో ఆ మాటలు పట్టుకొని మా అమ్మకూడా 'మీరు ఇక్కడ వున్నారుకదా అని పరుగెత్తుకొచ్చావా? లేపు వాళ్లింక జన్మన్నా కట్టుకుంటే నిన్నుకూడా మాకొత్తిన ఎక్కడా ఎక్కించుకుంటామనుకున్నా అయిన తరువాత వాళ్లుచెప్పినట్లు గా వినకపోతే ఎట్లాగనీ, వాళ్లు తిట్టినాపడాలి కొట్టినా పడాలి, తప్పుతుందామరి? ఈరోజుకి చేనుపడేది నేను పడటల్లా?' అనీ, చాటు చాటున కోప పడుతూ ఉండేది నా బాధ్యత, తనమీద పడితేఎట్లాగా, అనే భయంవల్లను తిరుగూతురు కాపురం చేయటం లేదని లోకం నిందిస్తుందనీ జంకువల్లను ఆవేదనంతా భరింపలేకనో ఏమో, ఇలాంటి విషాదపరిస్థితుల్లో వున్న నన్ను ఆదరించటానికి బదులు ఒకొకసారి ఎంత ఉక్రోషమైన్నా వస్తోసేది అలాంటి పరిస్థితుల్లో నా స్థితిమరీ అధ్వాన్నమైపోయేది నాకు శాంతి అనేది ఎక్కడ? ఎవరికైనా ఒకచోట దెబ్బతగిలితే ఇంకొకచోట విశ్రాంతిఉండాలి ఆ మాత్రంకూడా స్థానంలేనప్పుడు మనమింకా ఈ బ్రతుకు బరువును మోయగలిగేదట్లా? ఫుట్‌బాల్‌ను తన్నినట్లుగా ఇటువస్తే వీళ్లొకతన్ను అటుపోతే వాళ్లొకతన్ను తన్నుతూవుంటే మనగతేంకాను? ఈ కష్టాలన్నీ ఎవరికి చెపితే ఎవరి హృదయంలో దాచుకోగలుగుతారు? ఈ అంతులేని కష్టపరంపర ఎప్పటికైనా దానంతట అది విరమించవలసినదేకాని ఎవరికి చెపితేమాత్రం ఎవరు తీర్చగలుగుతారు?

సత్యం వార్ధక్యం జయించి తనకుతగిన ఇంకొక అమ్మాయిని వివాహం చేసుకొని వార్ధక్యంతోపాటు జీవితాన్నికూడా జయించాడు ఎంత అదృష్టవంతుడు అని నేననుకుంటూంటానేకాని ఆయనకుమాత్రం ఆ విశ్వాసంలేదు అంటే తను వార్ధక్యం జయించలేదనీకాదు, తగిన అమ్మాయిని, వివాహం చేసుకోలేదనీకాదు. జీవితాన్ని జయించాననే విశ్వాసంమాత్రంలేదు నా వివాహమైన తరువాత ఆయన నేను రెండుమూడు సంవత్సరాలు మాట్లాడటమే సంభవించలేదు వారింట్లో వారెవ్వరూ మా యింటికి వచ్చేవారుకారు మేమెవ్వరమూ వారింటికి వెళ్లేవాళ్లంకాదు అందువల్ల ఎప్పుడైనా బజార్లో అలా పోతూవుంటే దూరాన్నుంచీ చూచటమేకాని, దగ్గిర్లో కలుసుకోవటంగానీ, మాట్లాడటంగాని జరిగేదికాదు తరువాత వారిఅమ్మకు చాలా జబ్బుచేసింది దాదాపు బ్రతకదన్న పరిస్థితుల్లో మేము వారింటికి వెళ్లటం, తరువాత తరువాత వారుకూడా మా యింటికిరావటం జరుగుతూ ఉన్నది సత్యము నేనుకూడా మామూలుగానే మాట్లాడుతుంటుండేవాళ్లం మా పెళ్లిళ్లు కాకముందులాగా అంతచనువుగా మాట్లాడుకునేవాళ్లం కాదు ఎక్కువగా నేను నా కష్టాలను గురించే చెపుతుండేదాన్ని ఆయన చాలాబాధపడుతుండేవాడు నాకష్టాలు అలా చెప్పి చెప్పి ఆయన మనస్సును పాడుచేయటం నాకంత ఇష్టం ఉండేదికాదు అందుకని నేను మాఅత్తగారింటి దగ్గరనుండి వచ్చిన కొత్తరోజుల్లో ఏమిటి సంగతులు? అని ఆయన అడిగినా ఏమీలేవు సంగతులు అనేదాన్ని ఒకొకసారి నేను అలా అన్నప్పుడు నా పరిస్థితులు తనకు తెలియచేయటం లేదని ఆయనకుఎంతో కష్టంగావుండేది నేనేమైనా ఆయన్ను అడిగితే ఆయనకూడా చెప్పేవారుకాదు నేను నా కష్టాలనుగురించి చెప్పకపోతే ఆయన బాధపడ్తారనిగానీ, నేనే చెప్పకుండా దాచుకోలేకపోవటం వల్లగాని ఎక్కువగా చెపుతూనేవుండేదాన్ని నేను మావారి మనస్తత్వాన్నిగురించిచెపుతూ వుంటే ఒకొకసారి ఆయనముఖం కోపంతోఎఱ్ఱబారి, విచారంతో కమిలిపోయేది మీరుమాత్రం తగిన ఆమెను వివాహం చేసుకొని వార్ధక్యంతోపాటు- జీవితాన్నికూడా జయించారు అన్నా నొకసారి ఆయన్ను విచారాన్నుంచి మరల్చటానికి నీవలాంటి బాధలనుభవిస్తున్నంతవరకు నేను నా జీవితాన్ని జయించాననుకోలేను అన్నారు. ఆయనకు నామీద వున్న ఇలాంటి కరుణవల్లను, నన్నుపూర్తిగా అర్థం

చేసుకున్నందువల్లను, నాకు ఆయనమీద ఎంతైనా అభిమానము, గౌరవము ఆదరము ఉంటుందికాని అంత కన్నా ఇంకేమీ లేదు. ఇదంతా ఇతరులు అర్థంచేసు కోవాలంటే సామాన్యమా? ఆలోచనలో నిమిత్తం లేకుండా ఎవరిష్టంవచ్చినట్లు వారు చెప్పుకుంటారు

నేను మాయింటికి వచ్చినతరువాత అప్పటికింకా మంచిచీర కట్టుకోవటంగానీ, తలలో పూలు పెట్టుకోవటంగాని ఎరుగను ఎందుకో ఒకసారి డ్రామాకు వెళ్లాలనిపించింది అందరువెళ్తూ నన్ను కూడ రమ్మంటే, సరేనని ఆరోజు ఇస్త్రీచీరకట్టుకొని ఇస్త్రీజాకెట్ తొడుక్కొని ఒకసారి అద్దంలో చూచుకునేటప్పటికి తల్లోపూలుకూడా పెట్టుకుంటే బాగుండుననిపించింది నాకు తెలియకుండానే నేను వెళ్లే దారిలోనే ఘుబ్బమ్మగారి ఇల్లుంది ఏకాలంలో నైనాసరే వారింట్లో ఏవో ఒకపూలు పూస్తూవుంటవి. మా పొరుగింటామేకదా అని పూలు కోసుకోటానికి వారింటికి వెళ్లాను అంతా ఊరికివెళ్ళటాన ఆమె ఒక్కతే వున్నది ఆ ఇంట్లో ఆమె నాకు ఎదురు వచ్చి ఎక్కడికి? ఏమిటి? అని అడిగిందాశ్చర్యంగా డ్రామాకు వెళ్తున్నామన్నాను

డ్రామాకువెళ్తే ఇస్త్రీచీర కట్టుకోవాలా? అన్నది మళ్ళీ

పదిమందిలోకి వెళ్లేటప్పుడు మామూలు చీరైతే ఏం బాగుంటుందని కట్టుకున్నాను పూలున్నవిగా మీచెట్టున - అంటూనే చెట్టుదగ్గరకు పోతున్నాను

ఎవరెవరు వెళ్తున్నారు డ్రామాకు? వెళ్తే పూలెందుకు? అని ప్రశ్నలమీద ప్రశ్నలు కురిపిస్తూనే వున్నదావిడ. నేనామె ప్రశ్నల్లో కౌటిల్యాన్ని గ్రహించక పోలేదు నాఅంతటనాకు ఎన్నాళ్ళకో పూలుపెట్టుకోవాలనే కోరిక కలగటంవల్ల ఆమె మాటలను లక్ష్యపెట్టకుండా అలాగే పూలుకోశాను కాని ఆమెమాత్రం ఏవిధంగానైనాసరే నా ఉత్సాహాన్ని చంపివేయాలనే ధోరణిలోనే వున్నది. గచ్చుమీదకూర్చుని పూలు ముందువేసుకొని తల్లో పెట్టుకోటానికి వీలుగా మడుస్తున్నాను

భర్తదగ్గర లేకపోతే పతివ్రతలు పూలుపెట్టుకోరు అన్నదామె పుటుక్కున ఆ మాట కొంచెం మందగించిన నా ఉత్సాహపు పుటలలో ఒకపిడుగు పడినట్లైంది. అయినప్పటికీ సమాధానం చెప్పకుండా వుండటం ఏమంత బాగుంటుంది? వెనకటి రోజుల్లో ఎవరో చేశారని ఇప్పుడెలా ఎవరు చేస్తున్నారు? అన్నాను క్రుంగిపోతున్న ఉత్సాహంలోనుంచి కొంచెం తెప్పరిల్లుకుని

'పనకేమిటి? ఇప్పుడైనా భర్తదగ్గరలేనివాళ్లు భర్తమీద ప్రేమగలవాళ్లైతే పూలుపెట్టుకోక, ఎక్కడదాకానో ఎందుకు? మాచెల్లిలి భర్త జైల్లో వుండగా మా చెల్లెలు ఒక్కనాడైనా తల్లోపువ్వు పెట్టుకో లెరుగునా? భర్తమీద ప్రేమగలవాళ్లెవరైనా అంతే అసలదిపతివ్రత లక్షణంకూడా.' అన్నదామె మళ్ళీకొంచెం ఉద్రేకంతో వాళ్ళచెల్లెలు పూలు పెట్టుకునేదో లేదో నాకాజ్ఞాపకం లేదుగాని వారానికి రెండుసార్లయినా సినిమాలకనీ వాటికనీ, వీటికనీ ఎక్కడికో ఒక చోటికి పోతూనేవుండేది ఆమె భర్త జైల్లోవున్నాడని ఆమె మంచి మంచి చీరెలు కట్టుకోకపోవడంగానీ, సరదాగా వుండక పోవడంగాని ఏమీ వుండేదికాదు అంతామామూలు గానే వుండేది అన్ని విషయాల్లోను మామూలు గానే వుంటూ పూలెందుకు పెట్టుకునేదికాదో మరి నాకర్థంకాలేదు బహుశః ఏ శాస్త్రాన్నో పట్టుకుని అలావుంటేగాని పతివ్రతను కానేమోననుకొని అలా చేసివుండవచ్చు

నిజమే ఆమెఅన్నట్లు ఆమె చెల్లెలికి భర్తమీద ప్రేమ ఎక్కువగా వుండటానే పూలుపెట్టుకోలేక పోయేదేమో వాళ్ళు భార్యాభర్తలు ఒకరికొకరు తగినవారు కావటాన బాగా మనస్సులు కలిసిపోయే వుండవచ్చు వాళ్ళకు అన్నీ కలసివచ్చినవి వాళ్లు శుభసమయాల్లోనైనా కష్టసమయాల్లోనైనా మంచినే సంపాదించుకోటానికి అవకాశములున్నై కాని నేనో, నాకు నిజంగా వారిమీద అంత ఎక్కువగా ప్రేమలేనిమాట వాస్తవమే అది నాతప్పా? నాకు తగినంతలో నేను కాంక్షించినవేవీ వారిలో లేకపోవటం తప్పు ఉన్నదేదో ఉన్నది లెమ్మని కొంత సానుభూతితో ఆలోచించుకుని ఆత్మసంతృప్తి అయినా చెందుతుండేదాన్ని ఇదివరకు నన్నివిధంగా చేసిన తరువాత అదికాస్తా పోయిందిమరి. దానికి నేనేం చేయగలను? ప్రేమవుండడం లేకపోవటం మాట అలావుంచి జీవితంలో సుఖసౌఖ్యాలు ఎప్పుడైతే పోతవో సాధారణంగా అప్పుడే ప్రతివస్తువుమీద

ఇది రక్తవృద్ధిని చేయు విలువ గల వస్తువులచే తయారు చేయబడినది. మేహములు, నిశ్శక్తి నిస్సత్తువ, ఒళ్లు నష్టము, అతిమూత్రము మొదలగు వాటిని తగ్గించి, మంచిబలమును వీర్యపటుత్వమును కలిగించుటలో అద్భుతమయినది. అనేక సర్టిఫికెట్లు గలవు 2 డబ్బీలు చాలును

**20 తులముల డబ్బీ రు. 2/-**

**పోస్టేజి ప్రత్యేకము.**

## పి. సి. ఏ. అండ్ కంపెని

ఆయుర్వేదసమాజం

కొరిదేపి, (నెల్లూరు జిల్లా)

---

# కుష్ఠు ★ బొల్లి

వగైరా మేహ మచ్చలు, సెగ, సవాయి వ్యాధులకు గ్యారంటీ చికిత్స, క్యాటలాగు ఉచితము.

## జి. వి. రెడ్డి అండ్ కో

(రిజిష్టర్డు)

"భాస్కరాశ్రమము"

గోపాలపురం, తూ. గో. జిల్లా

---

# ఆర్షరసాయనశాల

# ముక్త్యాల, కృష్ణా

స్థాపితము 1925.

ప్రశస్తాయుర్వేదౌషధములకు నిలయము. ఏ మందు కావలసినను మాకు వ్రాయుడు. నమ్మకమైనవి లభింపగలవు

ఆయుర్వేదభూషణ

**వేటూరి శంకరశాస్త్రి,**

ఎ. ఎం. ఏ. సి.

Consulting Physician

---



విరక్తి కలగటం సహజం. నా వరకు నాకు ఇక్కడకు వచ్చిన తరువాత అలంకరణమీదనే అభిలాష నశించింది. అదేమిటోగాని ఆ అలంకారానికి సంబంధించిన ఏ వస్తువు కనపడినా అది నాకు సంబంధించనిదిగానే వుంటుంది ఎవరైనా సహృదయులు ముత్తయిదువులు తురుము పూలు వద్దంటూ నేమని తల్లో పెడుతూవుంటే గట్టిగా వారించలేను గట్టిగా వారించటానికి మా చేవాళ్ళ ఇవ్వో కోపం అనుకొంటారనికూడా భయమే భర్త దగ్గర లేనంతమాత్రాన పూలు పెట్టుకుంటే పతివ్రతలం కాకుండాపోతామనే భయం నాకు లేకపోటాన అంతగట్టిగా వారించవలసిన అవసరంకూడా రాలేదు. ఆరోజు నా అంతట నాకే పూలు పెట్టుకోవాలనే కోర్కె అంత ఎక్కువగా ఎందుకు కలిగిందో నాకే ఆశ్చర్యమౌతుంది ఆరోజు నా మనోవైరాగ్యభావాన్ని తెరలు తెరలుగా ఆవరిస్తున్న పూర్వ సంస్కృతులను ఆ సుబ్బమ్మగారి ప్రశ్నపరంపర ఎక్కడికక్కడే పటాపంచలు చేసేసింది అంతే ఆ రోజుకి ఈ రోజుకీకూడా నాకు మళ్ళీ తల్లో పువ్వులు పెట్టుకోవాలనే కోరికే కలగలేదు

ఏమిటోలే, మొగుడు ముండా అంటే ముష్టికొచ్చినవాడూకూడా ముండా అన్నాడట అల్లా ఇప్పుడు నేనందరికీ అయినే ఎప్పుడైనా సాయంత్రమప్పుడు ఏమీతోచక నేనూ వాకిట్లోకి వస్తే ఆ కృష్ణమ్మగారుకూడా అలాగే నేనెప్పుడో ఒకసారి వస్తానేమోనన్నా వినిపించుకోకుండా, ఆమాంతం పైటచెరగు మొలచేసుకొని వాళ్లయింట్లోకి లాక్కెళ్లి కూర్చోపెట్టుకొని ఇక ప్రారంభిస్తుంది ఏవంతా అయిందా? అంటుంది ముందు ఇంకా వంటకాలేదు మా అమ్మచూస్తున్నది వంటపని అంటాను

మీ అమ్మ చూడకపోతే మీ వదినేంచేస్తున్నది అంటుంది మళ్లీ మీఅమ్మకు కావలసినవన్నీ అందిస్తున్నది అని నేననగానే ఇక తనకేమీ సందు దొరక్క, ఊఁ లేక ఏమిటిలే నీ పనే బాగున్నది హాయిగా నిజంగా నాకే పిల్లలుంటబట్టిగాని లేకపోతేనా? అంటుంది వ్యంగ్యంగా అది నేను గ్రహించి - అంతహాయిగా ఉంటుందనుకుని పెళ్లిపోవాలంటే పిల్లలుమాత్రం అడ్డంవస్తారటలే, అనే దాన్ని. నేనెప్పుడు కనిపించినా సరే ఏదో రకంగా ఎత్తిపొడుస్తూనే ఉంటుందామె బయట చూస్తే ఈ విధంగా వున్నదా ఇక ఇంట్లో మాటంటే ఏవిధంగా వుంటుందో

నేను ఇక్కడకు వచ్చినతరవాత వారు మళ్లీ పెళ్లి చేసుకోవటముందు అయిదారు మాసాలవరకు మా అమ్మ ఎప్పుడూ నా మీద కోపంగానే వుండేది తన కొడుకువల్ల కష్టంకలిగినా ఆకోపమంతా కూడా నా మీదనే చూపిస్తూవుండేది ఆమె అలాచేస్తూ వుంటే, నేనీవిధంగా కాబట్టే కదా నన్నెవరెవిధంగా బాధించినా అని నాలో లోలోపల మరుగుతున్న దుఃఖం ఒక్కసారి పాలపొంగులాగా వచ్చేది ఆ పొంగును ఆర్పటానికి నేను లేనిశక్తిని తెచ్చుకోవలసివచ్చేది

నేనెంత మర్యాదవిడిచి చెప్పినాకాని మా అమ్మ అసలు నేనేదో ఎగురు మాట్లాడివుంటానని, పనులన్నీ సరిగ్గా చేయలేదనో అనుమానంగానే ఉండేది ఆమె అవిధంగా నన్ను అనుమానిస్తూవుంటే ఆమె హృదయంలో ఎక్కువభాగం చీకటితెరలు ఆక్రమించిన వేమో నన్నంత బాధపెడేదాన్ని తల్లిని బిడ్డ అర్థంచేసుకోలేకపోవటం ఎక్కడైనా సంభవం, సహజంకూడా కావచ్చునేమో కాని కన్నతల్లి అర్థంచేసుకోలేకపోవటమంత అన్యాయం ఎక్కడా లేదేమో తనను తల్లే అర్థంచేసుకోకపోవటంకంటె పైగా అపదలోకూడా ఉన్నప్పుడు మనుష్యుల కంఠకంటే వేరే బాధ అనేది ఎక్కడ వుంటుంది?

వారు పెళ్లిచేసుకున్నదాకా అంటే ఇక నన్ను అక్కడకు పంపించే ఆశారేఖలు అంతరించేవరకూ మా అమ్మ నన్ను ఆ విధంగానే ఒత్తిడిచేసింది ఆ పరిస్థితుల్లో మా అమ్మతప్ప నన్ను ఆదరించటంలో మా వదినగానీ, ఇంకే ఇరుగుపొరుగువాళ్ళయినా కొంత నయమనిపించింది వారు మళ్ళీ పెళ్ళిచేసుకున్నారు మా అమ్మ మనస్సు విచిత్రంగా మారిపోయింది ఆమె కెందుకో నా మీద జాలి [illegible] కలిగినది ఆమె హృదయంలోని చీకటితెరలు చించుకుపోయినవి ఆమె హృదయంలోని వెన్నెల కాంతులు నామీద ప్రసరించసాగినవి కాని అప్పటినుంచీ అంటే ఇక నేను నా యింట్లోనే వుండటం ఖాయమని తేలినప్పటినుంచీ నా కష్టాలు ఇంకొక రకమైన తీవ్రస్వరూపం దాల్చినవి. మా అన్నయ్య

బతికలు మాత్రం పూర్తిగా వ్యతిరేకమైనారు ఆఖరికి మా అక్కచెల్లెళ్లదగ్గరనుంచి కూడా వ్యతిరేకత ప్రారంభమైనది అయినప్పటికీ ఈ భారాన్ని నాకంటే మా అమ్మ ఎక్కువగా మోస్తూ వుంటూన నాకు కొంత సులభమే అయింది కాని నే నెంత పనిచేస్తున్నా ఇంకా పనిచెయ్యటం లేదని, నాకు అంత ఖరీదుగల చీరెలు జాకెట్లు ఎందు కొక్కవాలనీ ఏహేళనంగా మా వదిన, అక్కచెల్లెళ్లు అందరు దెప్పిపొడుస్తూ నేవుండేవాళ్లు అంటే దానికి కాపురమా కాలిపోయిందా? ఏ గుడ్డలిస్తే మాత్రం ఏం కట్టుకు నింట్లో పడుండేదానికి? అనే ధోరణిలో మాట్లాడుకుంటూవుండేవాళ్లు వాళ్ళెంతా అయినా వీటిని నే నేమంత లక్ష్యపెట్టలేదు నేనింకా ఎక్కువ విచారంలో మునిగిపోటానికి వేరే కారణం వున్నది

మా నాన్నగారు నా పెండ్లికాకమునుపు, అయిన తరువాతకూడా కొంత కాలంవరకూ, మనిషిని చూస్తే భయంగాను, ఎంతో హుందాగాను వుండేవారు అలాంటివారల్లా ఒక్కగానొక్క కొడుకైతే మా అన్నయ్య కూడా తనమాట వినకపోవటం, కేవలం భార్యను వాళ్ళవైపు వాళ్ళను వినక వేసుకుని ప్రతి దానికీ తయ్యారికి కాలుదువ్వటం, ఒక్కడుగదా ఏవిధంగానైనా చదువు చెప్పించి అభివృద్ధిలోకి తీసుకురావాలంటే చదువుకోకపోగా ఎక్కడ అప్పులు పుడితే అక్కడల్లా నోట్లు వ్రాసి అప్పులు చేయటం, ఇవన్నీ మొదలుపెట్టేసరికి ఆదోక విచిత్రంగా మారిపోయారు అంతకుపూర్వం వున్న గంభీరత, ఇంట్లోవాళ్ళను గడగడలాడించటం అదంతా మారిపోయింది మరీ మా సంసారం అట్లా అయిన తరువాత ఆయన కపటు మరేపోయింది ఆయన మనస్సుతోపాటు ఆరోగ్యం కూడా పూర్తిగా చెడి పోయింది నే నిక్కడకు రావటాన్ని గురించి మే మంతా అనేకవిధాలుగా కిందా మీదా పడుతూ వుండేవాళ్లమా? ఆయన ఒక్కనాడైనా నాతో ఏమిటిది అనిగాని, నీవు వెళ్లు, వెళ్ళవద్దు అనిగాని ఒక్కసారికూడా నోటా పల్లాపట్టి అడిగిన పాపాన పోలేదు మానవుడు కాని మా అమ్మ ఇలా మొదలు కుండా వూరుకుంటే ఎట్లామరి? అసలు సంగతేమిటో కనుక్కొనిరాక అని అనగా అనగా ఒకసారి కాలోఱ బయలుదేరి వెళ్లారు మా అత్తగారి వూరికి, వెళ్ళటం కూడా వారింటికే వెళ్లారు. ఎందుకలా పంపించాలిసొచ్చింది? ఎన్నడు మాపోటివాళ్ళకన్నా ఎదురు చెప్పే పిల్లకాదే మా పిల్ల లందర్లోకీ ఈ అమ్మాయి ఇంకా నిదానమైనది ఏమిటిదంతా? అని అడిగారట వారిని

మీ పిల్ల మీకు ఎదురు చెప్పకపోతే అందరికీ ఎదురు చెప్పదని నమ్మక మేమిటి? అది ఎన్నెన్ని చిత్రాలు చేసేదో మీకేం తెలుస్తుంది మేం చెప్తే మాత్రం మీరు నమ్ముతారా? అని మా అత్తగారు అందుకున్నదట

మీ రుండండి మిమ్మల్ని కాదు నే నడిగింది ఆయన్ని సమాధానం చెప్పనివ్వండి అన్నారట మా నాన్నగారు

ఇంకా ఇంతమంది చెప్పటాని కేమున్న దక్కడ? ఎవరుచెప్పినా అదే—అన్నారట వారు సరే మీ అల్లుడిచేతనే చెప్పించుకోండి నేనొద్దన్నానా అని మా అత్తగారు అన్నదట

ఒకరడిగే దేమిటి ఒకరు చెప్పేదేమిటి నా జోలి ఒకరి కెందుకు? నా యిష్టం వచ్చినట్లు నేను చేసుకుంటాను ఒక రెవరు నన్నడిగేటాని కసలు— అని వారు కోపంగా మాట్లాడారట

ఇట్లా తొందరపడి మాట్లాడినంత తేలికగా పోతుందా అబ్బాయి చేసుకున్న తరువాత అని మా నాన్నగారు అనేటప్పటికి

పోకపోతే చేతనైందేమైనా వుంటే చేసుకో పోయి ఇదిమొదలు చేసుకుని నా వాకిలిచాయలకు రాబోకండి ఎవరైనాసరే—అని లేచివెళ్లారట అంతే అప్పటినుంచీ ఇక నా విషయంలో ఆయనకు పెద్ద విచారం ఏర్పడిపోయింది మనస్సులో ఆయన వ్యాధి కూడా ఇంకా ఎక్కువ కావటం మొదలు పెట్టింది వారు మళ్ళీ పెళ్ళిచేసుకున్న తరువాత ఆయన వ్యాధి ఇంకా ప్రబలమై చివరకు ప్రాణాలు కూడా విడువవలసి వచ్చింది మా నాన్న ప్రాణం పోయేటప్పుడు ఆ బాధ చూడలేక నేను చాటుకు పోయి కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్నప్పటికీ ఆయన ప్రాణం పోయేటప్పుడు కూడా నన్నే తలుస్తూ వుండటం నాకు కూడా వినబడుతూనే వున్నది తను పోతున్నానే అనీ, నేను కష్టంలో వున్నాననీ, నాకు బాగా జరుగుతుందో జరగదోననీ, ఆయన

భయం. అందువల్లనే ఆయన నన్నింతగా తలుస్తూ ప్రాణాలు వదిలారు.

అప్పటినుంచీ ఇక నా కష్టాలు అడుగుతారు. అంతకుముందు నే ననుకుంటున్నదాన్ని—జరిగిందేదో జరిగింది మా అమ్మా నాన్నా బాగుండగానైనా నేను చనిపోతే బాగుండునని కాని నేను జీవితంలో వటి! భయపడ్డానో అవల్లా నాకే జరుగుతూ వచ్చినవి అక్కడినుంచి ఇక్కడికి రావటం ఇంటికి దూరమై చెట్టునీడకు వచ్చినట్లయిం దిప్పుడు నాపని మా అమ్మ కిప్పుడు నామీద ఎంత ప్రేముంటే మాత్రం ఏంచేయగలుగుతుంది! మా నాన్న వున్నప్పుడే అంతంత మాత్రమాయె మా నాన్న పోయిన తరువాత మా అమ్మ కోరత్తటానికి ఏమీలేకుండా పోయిం దా యింట్లో ఆమే మా అన్నయ్యదగ్గర మనోవర్తి పుచ్చుకోవలసిన పరిస్థితుల్లో ఇంకా నన్నేం పోషించ గలుగుతుంది! ఈ పరిస్థితుల్లో నా పౌరుషం కోపమని నా భారాన్ని కూడా ఆమె మీద మోపి ఆమెను బాధించేకన్నా ఎన్నికష్టాలైనా రానీ, నా భారాన్ని నేనే మోయాలి ఈ పని చేయాలంటే మళ్ళీ అక్కడికే వెళ్ళక తప్పదు ముమ్మాటికీ తప్పదు. కాని నిజంగా అలా చేయగలనా! ఏమిటో నిరాశనూలాన కలిగే నిస్తబ్దతవల్ల అలా అనుకోవటమే కాని చెయ్యాక ఏంచేస్తాను! జీవితంలోని ఈ నిస్తబ్దత సర్వనాశానికే దారితీసేదిగా కనబడుతూ వుంది ఈ నిస్తబ్దతనుంచీ బయటపడాలి అంటే తప్పకుండా మళ్లీ అక్కడికి వెళ్లాలి ఇప్పుడు అక్కడి పరిస్థితులు వెనకటి పరిస్థితులు కావు. అనాటి అత్తగారు లేదు. వారిలో కూడా వయస్సును బట్టి అయితేనేం, అనుభవాలనుబట్టి అయితేనేం, ఆ నాటి దుందుడుకుతనమూ లేదు. నిజంగా అంత దుందుడుకుతనమే ఉంటే మళ్ళీ రమ్మంటారా! పరిస్థితులు మార్పు మానసికమైన మార్పుకూడా తోడ్పడవచ్చు. ఈ అవకాశాన్ని పురస్కరించుకుని వారిలో మార్పు తీసుకురావటానికి ప్రయత్నం చేయాలి ఈమాత్రం నేను చేయలేకపోతే నా బాధలు నాకే కాకుండా ఇతరుల కష్టాలను ఇనుమడింపచేయటానికి కూడా తోడ్పడతవి నా క్షేమంకోసం కాకపోయినా కనీసం నా సంబంధీకుల క్షేమంకోసమైనా మళ్ళీ అక్కడకు వెళ్లితీరాలి కాని అప్పుప్పు నా జీవితాన్ని నేనే ఒకసారి పునరాలోకనం చేసుకునేటప్పటికి ఆ సంఘటనలన్నీ కళ్ళల్లో కదలి (క్రొమ్ముకొరూ) హృదయంలోకి దూసుకుపోతున్నై. ఈ ఆలోచనలతో నా మెదడు చుట్టలు తిరిగిపోతూ వున్నది ఈ బాధలతో నా హృదయం రక్తాన్ని చిమ్ముతూ వున్నది నా తెలివితేటలు ప్రతిభ, యవ్వనము అన్నీ మిళితమై మనపై ఈ చుట్టలు తిరిగిన రక్తపు చేరులలో కలసిపోయినవి ఇంకా నాకు స్వతంత్రతేమిటి? ఆలోచనేమిటి? నిర్ణయమేమిటి? ఈ సమాజంలో ఇదేనా నా స్థానం? ఇదేనా భారతనారీమణుల సౌశీల్యసంప్రదాయం? ఇదే కాబోలు భారతనారీమణులు గవర్నర్లుగా వుండటం, మంత్రులుగా వుండటం, విదేశాంగ రాయబారులుగా వుండటమూను!





సీతా రామ లక్ష్మణులు.

# దెందుకూరి శిథిల శిల్పసంపద



శ్రీ కో. రాఘవాచారి

ఖమ్మంమండలములోని మధిర తాలూకాకు చెందిన దెందుకూరు గ్రామములో ఆంజనేయ స్వామి దేవాలయము ఒకటి కలదు. ఈ ఆలయ ప్రాంగణములో ఒక సత్రమును నిర్మించు సదుద్దేశ్యముతో శ్రీమతి కపిలవాయి సీతమ్మగారు ఆలయపు దక్షిణభాగములో పునాదులు త్రవ్వించుచుండగా రెండున్నర గజముల లోతున, ఒకదానిపై నొకటి పేర్చియున్న విగ్రహములు ఇరువదియొక్కటి బైట పడినవి. ఇక్కడి బొమ్మలో వాటిని చూడవచ్చును.

క్రింది వరుసలో పద్మాసనస్థులైనవారు ఏడుగురున్ను, వెనుక నిలచియున్నవారైదుగురున్ను చేరి పన్నిద్దరాళ్వార్లు. ఇరుప్రక్కల త్రిభంగిని, నిలచియున్నవారు ద్వారపాలకులు. మధ్యభాగములో సీతారామలక్ష్మణులు లక్ష్మణునికి కుడిప్రక్కన గరుడాళ్వారు. పై పటములో సీతారామలక్ష్మణుల మూర్తులు పెద్దవిగా చూపవచ్చును.

వాని పీఠములు ప్రత్యేకముగా పద్మములుగా మలచుటకు వీలు లేకపోవుటచేత కాబోలు, పాదముల దిగువ పద్మములను అర్ధశిల్పముగా మలచినారని యూహించవచ్చును. విగ్రహములకు దిగువవున్న వ్రాలుపలకల రాతి మొకులనుబట్టియు, విగ్రహముల చిన్న పొడవునుబట్టియు (మూడున్నర అంగుళులు) ఈ విగ్రహములు ఏదేనొక పెద్దదేవాలయ ప్రాంగణములో నిర్మించిన చిన్న కోదండరామస్వామి ఆలయములో ప్రతిష్ఠ చేయబడియుండునని యూహించ వీలగుచున్నది

ఈ ఆంజనేయ ఆలయప్రాంగణములోనే ఈ విగ్రహములు దొరుకుటకు రెండు నెలలు ముందుగా, నాల్గున్నర అడుగుల ఎత్తుగల ముఖమంటప శిలయొక్కటి లభించినది దీనిపై, ప్రాచీనాంధ్ర లిపిలో ఎనిమిది పంక్తుల దానశాసనమొకటి ఉన్నది అది ఇది

"స్వస్తి శ్రీ మన్మహామండలేశ్వర మన్మ భా
గి గణపయ రాజులు కాకోలని కేశవ
దేవరకు రెండు మత్తురులు వేసిరి వా
న కౌలాలు ఆచంద్రార్క స్థాయిగా నిస్తిమి"

దీనినిబట్టి ఈ ప్రాంతములోనే కేశవస్వామి ఆలయము ఒకటి పెద్దగ వుండియుండుననియు, పైన చూపిన కోదండరామస్వామి ఇత్యాది విగ్రహములు ఆకేశవస్వామి ఆలయములో నుండిన చిన్న దేవతలు లోనివైయుండునని వూహించుచున్నాము

పైన చెప్పిన (ఆంజనేయస్వామి) ఆలయములో ఇంతకు పూర్వము, ఈరీతిగనే ఆంజనేయ విగ్రహము, రెండు శివలింగములు, పూర్వపు దేవాలయములకు సంబంధించిన పునాదులు, బైటపడినవట గ్రామీణులలో పెద్దలైన శ్రీకపిలవాయి కృష్ణయ్యగారు ఆంజనేయ విగ్రహమును మాత్రము నేటి ఆలయములో ప్రతిష్ఠించి, శివలింగములు భిన్నమైనందున ఆలయప్రాకారములోనే పూడ్పించిరట నేటికిని, ఆలయప్రాంగణములో రెండు పాత పానవట్టములు, వినాయకుని విగ్రహము, దేవీ విగ్రహములు విడిగా కనబడుచున్నవి

ఈ పెందుకూరు గ్రామము నూరు, నూటయాభై సంవత్సరముల పూర్వము ఏర్పడినదని, అంతకుముందు ఈ ప్రదేశములో సారంగపట్టణమను పేర ఒక పట్టణము వుండెడిదని ఒక జనశ్రుతి ఈ పట్టణము అనేక శైవ, వైష్ణవ దేవాలయములకు ఆటపట్టని ప్రసిద్ధి

దొరికిన విగ్రహములు విరివిగా శైవ, వైష్ణవ సాంప్రదాయములకు చెందియుండుటనుబట్టి, ఈ జనశ్రుతి సత్యమే యైయుండునని మనవిచేయుచున్నాము శాసనపు లిపి కాకతీయ యుగమునకు అనంతరపు లిపివలె గోచరించుచున్నది. కాకతీయులు పరమశైవులు వీరి పతనానంతరము, తెనుగు దేశము నేలిన రెడ్డిరాజులు శైవులే అయినను,



పన్నిద్దరాళ్వార్లు

శ్రీరంగమునుండి, ఉత్తరాదికి వచ్చిన వైష్ణవస్వాముల బోధవల్ల వైష్ణవాలయములుకూడ కట్టించినట్లు కొండవీటి వైష్ణవ క్షేత్రములు సాక్ష్యమిచ్చుచున్నవి. పన్నిద్దరాళ్వార్లు, గరుత్మంతుడు, (బహుశా ఆంజనేయస్వామికూడ వుండియుండును) ద్వారపాలకులు చేరిన విండోలగముతో సీతారామలక్ష్మణులుండిన పూర్ణ వైష్ణవ సాంప్రదాయము కడపటి రెడ్డి



దానశాసనము.

రాజుల కాలములో గాని కడతేరియుండదని యూహించుచు, ఈ విగ్రహములు పదునైదవ శతాబ్దము నాటివై యుండునని యూహించుచున్నాము. (పైకాపనము, ఈ విగ్రహములను ఒకే కాలమునకు చెందియుండునను యూహ సత్యదూరము కాకపోయినను, నిర్ధారించి చెప్పుటకు వీలులేనిది) శిల్పమైనను మూర్తి వైష్ణవమత సాంప్రదాయ విజృంభణకు నాందీ రూపమగు సాంకేతిక సాంప్రదాయము ననుసరించినట్లున్నది గాని, దేశమునందు స్థాయిగానుండి, పూర్ణ వికాసము చెందిన శిల్పసంపదకు చెందినట్లు లేదు. విన్యాసములో కాకతీయ సాంప్రదాయమునకు చెందిన లాలిత్యము గోచరించుటలేదు. అట్లని విజయనగర కాలపు పూర్ణవికాసముకూడ కనబడదు. ఈ కారణములచే, ఈ విగ్రహములు కాకతీయ, విజయనగర కాలములకు నడిమి కాలమునకు చెందినవని వూహచేసినాను. విగ్రహములన్నియు ఒకదానిపై నొకటి పేర్చి, భూస్థాపితము చేయబడియుండుటను బట్టి ఏ భామినీసుల్తాను కాలములోనో ఇవి నాశనము చేయబడునను భయము కలగ, భక్తులు కొటిని భూగర్భమున దాచి, ప్రాణరక్షణకు దక్షిణాదికి తరలిపోయిందురేమో యని వూహించవచ్చును. కనుక ఈ ప్రాంతమునందు విరివిగా భూగర్భపరిశోధన చేసినచో పైన చెప్పిన సంధికాలపు సంఘచరిత్ర నిర్మాణమునకు సాయపడగల శిలాశాసన విగ్రహసంపద విరివిగా లభించునని మనవి చేయుచున్నాను.

# పోయిన పుటలు



శ్రీ అంగర వెంకటకృష్ణారావు

నేను ఆదవపుజిల్లా మేజస్ట్రీటువద్ద క్యాంపు గుమాస్తాగా వున్న రోజులలో జరిగిన వొక సంఘటన, నన్నమాంతంగా వొక దశాబ్దానికి పైగా వెనక్కు నెట్టింది

ఆ రోజులలో నాకు రోజూ వొక అరగంట సంక్షిప్తలేఖనం, సుమారొక గంట టైపుపని వుండేది మా ఆఫీసరుగారు న్యాయమైన ప్రభుత్వాధికారి, నిజమైన ప్రజాసేవకుడు ఇంటికి రావొద్దని చెప్పిన గజిటెడ్ ఉద్యోగి నా దృష్టిలో అతనొకడే

కాని ఆ వక్కడ అప్పటి కాలం మనలేక పోయేడు. అక్కడ నా జీవితం నిర్మానుష్య ద్వీపంలో 'క్రూసో' బ్రతుకులా వుండేది మోసం ఉచ్ఛ్వాస నిశ్వాసాలుగా జీవిస్తూన్న ఆ ఆఫీసు ఉద్యోగుల మధ్య నాకు వూపిరిసలపకుండేది కాదు నిర్వ్యాపకంగా వున్న నిముషాల్లో, సంఘానికి, జీవితానికి, నాకు గల సామరస్య వైషమ్యాలు వూహా కందక, శూన్యంలో మనసు కరిగి కలిసిపోవటం పరిపాటిగా వుండేది

అట్లాంటి సమాధిపరిస్థితిలో నే వున్న వొక నాటి మధ్యాహ్నం బంట్రోతు వచ్చి 'బాబూ— చిన్న పిటీషను టైపు చెయ్యండి' అని ప్రతిమాలేడు. సమాధిలో వుండే, ఆ కాగితం అందుకుని, అప్రయత్నంగా చివరవరకూ చదివేను

'ఎవరిదోయ్ యీ పిటీషను?'

'ఒక బీద బ్రాహ్మడిదండి'

'అతనిని పిలు' బంట్రోతు వెళ్ళేడు

పిటీషను వ్రాసిన ఆ మామి వచ్చేవరకూ నా మనసు దట్టమైన పొగమంచు క్రమ్మిన హేమంత చంద్రికారాత్రివలె వుంది అతను వచ్చి నాముందు నిలబడ్డాడు—లోతుకు పోయిన బుగ్గలు—చెడు కాలపు జలగ నెత్తురు యీడుస్తూ పీల్చివేయగా మిగిలిన బొమికెలగూడు! జరిగిపోయిన రోజులను కబళించిన విస్మృతి అనే చీకటిని చీల్చ ప్రయత్నిస్తూంది నా జ్ఞాపకశక్తి విస్మృతిరాహువు దవడలు నములుతూంటే, క్రమేపీ జ్ఞాపకంలోకి ఉదయిస్తున్నాడా వ్యక్తి—అదంతా వొక పెద్ద అపశేషములా వుంది అతని ఫాలభాగం వెడల్పై, కాంతి తేరి, బాలారుణ బింబంవంటి కుంకుమరేఖతో విరాజిల్లింది తరుణ రక్తం పూరించి బుగ్గలు మిసమిసలాడేయి అన్యమైన ప్రభావం వల్ల తేజస్సు కలిగిన ఆ నేత్రాలు తిరిగి తళుకులు కులికేయి ఆరటంగా ఛాతీ లేచింది దంతలలో కంపలు కన్పెచ్చులు తిరిగేయి పదిహేళ్ళ క్రిందటి విగ్రహం నామదిలో పొడచూపింది

'పతంజలిశాస్త్రిగారూ! నేను జ్ఞాపకం వున్నానా?' హఠాత్తుగా అతని కవ్వు నేత్రాలలో గుడ్లు మరీ లోతుకు ముంచుకపోయేయి

'లేఁండి!' చితికిపోయిన డప్పులా ఆ గొంతు భయపెట్టింది అతను యింటికోసం వ్రాసిన అర్జీ కాగితం నా చేతులోంచి జారి క్రింద పడిపోయింది ఒక ధర్మాత్ముడు తన యిళ్లలో వొకటి సద్బ్రాహ్మణ కుటుంబానికి నివాసంగా యిచ్చేనిమిత్తం కేటాయించి, ఆ అధికారం జిల్లా కలెక్టరుకిచ్చి చనిపోయేడు—ఆ యిల్లు తన కిమ్మని అర్జీ దాఖలు చెయ్య బోతున్నాడీ సద్బ్రాహ్మణుడు!

'శాస్త్రిగారూ, మీరు పీఠనగరంలో కొన్నాళ్ళున్నారుకదూ?'

'అవునండి' అతను తడబడ్డాడు 'కాని మీ రెవరో నాకు తెలీదు నేను మీ రనుకున్న మనిషిని కాను—మనిషిని పోలిన మనిషుంటాడు' ఆ మాటలలో జాలి, దొంగతనం, బిడియం, యస్కేపిజం, కుస్తీలు పడుతున్నాయి

నా మానసవాటికమీద గతించిన రోజులు, ఆటలు, నవ్వులు, రొమాన్సు దృశ్యాలుగా మరలో స్మృతితో విరిసి, కరిగి, మాయమౌతున్నాయి.

'మీరు ఆంజనేయస్వామిమఠంలో కుమా

మెట్లెక్కి నాకోసం అటూ యిటూ పరికించి, వన్నాగదిలో చూసి, వొక్క గంతున లోన ప్రవేశించేడు వాడికి కొత్త లేదు—నాకంటె వొక్క యేడాది చిన్నైనప్పటికీ మూడు క్లాసులు తక్కువ. వస్తూనే గది అంతా కలయ చూసేడు శాస్త్రి వేపు చూసి 'నా కొక్క ప్లూరొత్తి యివ్వండి' అని అడిగేడు.

'వీడు నా స్నేహితుడు—అంజనేయులు', పతంజలిశాస్త్రి నవ్వేడు — పేరు చెప్పక్కర లేకుండానే తెలుస్తోంది'

ఆంజనేయులు శాస్త్రి వేపు తీవ్రంగా చూసి, పళ్లికిలించి నవ్వి, రెండు కాళ్లూ యెగరేసి 'అక్క భాస్ కృభాస్ బాగా పాల్చేసేవే లబ్బులబా, లబ్బులబా, లబ్బులబా' అని గంతులువేసి, తిరిగి హేళనగా నవ్వుతూ పరుగుతీసేడు శాస్త్రి వేపు నేను ఉదాసీనంగా చూసి 'వెంకె నెగరు' అన్నా వాడి తిరఫున తను వేసుకుంటూన్నట్టు శాస్త్రి 'కాదు వాడు మంచివాడే' అని బంతి పువ్వురంగు శాలువపై మీద కప్పుకున్నాడు 'జాగ్రత్తగా వుండవలసిన వాడివి నువ్వే నువ్వు బాగుపడితావు' నేనప్రయత్నంగా అన్నా 'ఉంటారా యిక్కడ కొన్నాళ్లు?'

'ఉండాలనేవచ్చా' అంటూ అతడు నాకళ్లలోకి తీవ్రంగా చూసేడు

మఠంలో ఆరాధన తప్పకగా వుండేది పూజార్లు ఆ ఆవరణలోనే నివసిస్తూండేవారు పిల్లల మందరం కూడి ప్రతి సాయంత్రం 'భజన' పేరిట గోలో పాటలు పాడే వాళ్లం అంజనేయులు కన్నడ పాటలు అపశృతిలో నక్కి కేకలులా పాడే వాడు అక్కడ వొక బోక్కి హార్మోనీ కూడా వుండేది

ఆ వేళ సాయంత్రం నేను కృతిలాగుతున్నాను అంజనేయులు 'తిప్పాగళమ్మనే నొప్పి కోళ్లో మమ్మప్పకాయ తేకొ తిమ్మప్ప నీవు' అని భయంకరంగా అరుస్తున్నాడు మిగిలిన కుఱ్ఱకారంతా యెవరికి తోచిన లయలో వాళ్లు చప్పట్లు చరుస్తున్నారు. అప్పుడు శాస్త్రి మెల్లిగా వచ్చి అంజనేయులు మెడమీద చెయ్యి ఆనించి కూచున్నాడు అంజనేయులు చుంచులా కొండ తంచి చిరునవ్వుతో పాట సాగనిచ్చేడు.

'అంజనేయులూ, బాగా పాడతావే!' మెడ మీది వేళ్లు బిగించేడు.

'ఉండండే, కోతులా మీరూను'

'ఏం కోతులు?'

'తంకాయలు, గుమ్మడికాయలు. యిహి హిహి—' అంతా గొల్లున నవ్వేం

'అలాక్కాదోయ్ చూడు ఆ హార్మోనీ శబ్దం యెలా వుంది అది శృతి అంటారు'

'చెప్పక్కర్లేదు'

'ఆ శృతిలో నీగొంతు కలపాలి—మాట స్వచ్ఛంగా పలకాలి అలా పాడితే హాయికి ఆనందం కలుగుతుంది'

'లేకపోతే' అని కొంటె ప్రశ్న వేసేడు

'చుట్టుప్రక్కలవాళ్లకి బాధగా వుంటుంది. చూడు యిలా పాడాలి'

శాస్త్రి హార్మోనీ శృతిలో గొంతు 'ఆ' అని కలిపి ఆ పాట తిరిగి మృదువుగా, హాయిగా, భక్తిగా పాడి వినిపించేడు మాకందరికీ ఒళ్లు పులకరించింది పూజార్ల యింట్లో పనిచేసే 'సైకి' వచ్చి మండపంక్రింద బొమ్మలా నిలబడి పాట వింటూంది దానిలో కూడా భక్తి వికసించింది కాబోలు.

'అబ్బాయిలూ, మనం అంతా కలిసి వొక బాలభక్త సమాజంగా తయారవుదాం నెల కొకసారి రావిచెట్టు క్రింద వున్న ధర్మమండలివారి భజన పార్టీనికూడా పిలిచి, చక్కగా భజన చేస్తే, అంతా వచ్చి ఆనందిస్తారు అప్పుడు మనం భజన యింకా సక్రమంగా చెయ్యొచ్చు ఏమంటారు?'

మాకు చాలా సరదా వేసింది అలాగే అన్నాం కాని అంజనేయులే చిన్న సమస్య లేవదీసేడు 'ఆ డబ్బు డవాలంతా వేశ వరకూ మనకేదైనా ప్రసాదాల యేర్పాటుందా లేక మన భజన మిరియాల దండుగకేనా?'

'ప్రసాదాలు కావలసినన్ని ఆవన్నీ నేను చేయిస్తాను' ఆ మాట వినగానే అంజనేయులు అంజనేయస్వామిలా పొంగిపోయు, గక్కుమని లేచి గుండెలకు మోకాళ్లు తగిలేలా కుప్పి గంతులువేసి 'అక్క భాస్ కృభాస్ బాగా చెప్పేవ్—లబ్బులబా లబ్బులబా' అని పట్టి తాండవం చేసేడు. మంగళహారతి

ముగియగానే అంతా వెడిపోయేరు—నేనూ శాస్త్రీ వెడుతూంటే వైది మండపం చాటుకు మెల్లగా తప్పుకుంది.

పతంజలిశాస్త్రి మీద చుట్టుప్రక్కల పెద్దలందరికీ గౌరవభావం యేర్పడింది ఆ కారణంవల్ల అతనిమీద నాకున్న గురుభావంవల్ల నేనతనితో అనుచిత్యం వుండడం మా వాళ్లు హర్షించేరు శాస్త్రి కూడా నన్ను శిష్యవాత్సల్యంతో చూస్తూ, నెప్పుడూ సక్రమ మార్గంలో నడిచేటట్లు చెయ్యడానికి ప్రయత్నించేవాడు నేనూ వకుళం వొంటరిగా వున్న సమయాల్లో యేదో పని కలిపించి నన్నెక్కడికో పంపుతూండడంవల్ల వకుళానికి నా మీద కొంత అసహ్యం కలిగింది వకుళం మా పొరుగింటి ప్లీడరు గారి కూతురు—చురుకైనది—మంచి నెమ్మది కలిగినది—ఆ పిల్ల నాకు ప్రాణంకంటె యెక్కువ

వకుళం అంజనేయులకు దూరపు బంధువు వాడివల్లే నాకాపిల్లతో పరిచయం కలిగింది

ఆవేళ సాయంత్రం ఐదు దాటిన వరహా మఠం డాబామీద శాస్త్రి నేను కూచుని యేవో కబుర్లు చెప్పుకున్నాం తరవాత శాస్త్రి సంధ్యావందనానికి వెడిపోయేడు పిల్లిలా చప్పుడు చెయ్యకుండా వకుళ వచ్చి నా వెనక నుంచుంది

'ఏమి టాలోచిస్తున్నావు?' పరధ్యానంగా వున్న నేను ఉలిక్కిపడ్డాను వెనుదిరిగి ఆమెను చూడగానే నా ఆశ్చర్యం రేపింది ఆమెలో యేదో గొప్ప మార్పుగుపించింది అప్పటికి సుమారు వారం రోజులనుంచి వకుళం నా కంట పడలేదు. అంజనేయులు నడిగితే, 'వకుళ మూన్నాళ్ళపాటు యెడంగా కూచుందిరా యేవిటో—పెద్దమనిషైందను కుంటున్నారు' అన్నాడు నాకేమీ అర్థం కాలేదు పెళ్లికాకుండా పెద్దమనిషెలా అయిందిగా అంటే నాకిక బోధపడలేదు.

'ఏం వకుళా! వారంరోజులై యెక్కడా జాడ లేదు!'

'వారం రోజులై నేను జాడలేదుగాని, నువ్వెన్నాళ్ళయి జాడలేదో గుర్తుందా? శాస్త్రి దగ్గర వైదికం నేర్చుకుంటున్నావా?'

'వైదికం నేర్చుకోడానికి మాకర్హత లేదు'

'అయితే మంత్రాలు నేర్చుకుంటున్నావా?'

నాకేం జవాబు చెప్పాలో తోచలేదు ఆమెను చూస్తున్నకొద్దీ ఆమెలో యేదో తీవ్రమయిన మార్పు గోచరిస్తోంది నిజంగా పెద్దమనిషయిందా? అంటే యేమిటి? నే నెప్పుడు పెద్దమనిషవుతాను? వాడంపలు, హృదయభాగం చూసుకున్నా ఇలా ఆలోచిస్తూంటే పడమటి దిక్కునుంచి అరుణారుణ కాంతుల్ని కలిపిస్తూ వొక కారుమేఘం పరుగెత్తి వస్తోంది రివట గాలి వెనుగాలిగా మారి వుధేస్తుగా టపటప చినుకులు పడసాగేయి డాబామీద దక్షిణ దిక్కున దగ్గరగా వున్న గదిలోకి పరుగెత్తేం వెంటనే ఆవాన పెద్దదై వుత్తరగదిలోకి మమ్మల్ని వెళ్లనివ్వలేదు దక్షిణగది చెట్లు కూలిపోయివుండడం చేత అక్కడ మేం ఖైదయిపోయేం ఎదురుగా కిటికీ లోంచి వకుళయిల్లగుపిస్తోంది ఆమె కిటికీ మూసింది

'కిటికీ మూసేవేం?'

'చలిగాలి వీస్తోంది' ఆమె మందహాసం చేసింది

'వకుళా! నీలో యేదో మార్పు కలిగింది అది నాకర్థం అవడంలేదు నాకు చెప్పవూ?' ఆమె సుదీర్ఘమైన కనురెప్పలు బరువుగా వాలేయి ఎందుకో వాటిని చుంబించాలనిపించింది హోరని వర్షపు శబ్దాన్ని చీల్చుకుని క్రింద మండపంమీంచి అంజనేయులు 'లబ్కులబా' వినిపిస్తోంది నెమ్మదిగా వకుళాన్ని సమీపించి దగ్గరకు తీసుకున్నా తటాలున ఆ పిల్ల నా హృదయంమీద రెండు చేతులూ అదిమి పక్కకు నెట్టి, ధారాపాతంగా కురుస్తున్న ఆ వర్షంలో, డాబామీదుగా పరుగెత్తి ఉత్తర గదిలోంచి అదృశ్యం అయింది ఆమె వెడలిపోయిన ఐదునిమిషాల తరవాత 'గోపాలం' అని పతంజలి శాస్త్రి పిలుపు వినబడింది

అతను గంటసేపు నన్ను పృచ్ఛించిపృచ్ఛించి విషయం అంతా గ్రహించేడు అమాయకంగా నా ఆరాటం అంతా అతనికి చెప్పేను శాస్త్రి వుగ్ర రూపం ధరించేడు భగవద్గీత చేతిలో పట్టుకుని 'దీనిమీద చెయ్యివేసి ప్రమాణం చెయ్యి మళ్లీ అలాంటి పొరపాటు చెయ్యనని' అని గద్దించేడు — కైట వస్త్రం పడుతూన్నట్టు నాకళ్లంట అశ్రువులు జలజల రాలేయి. ప్రమాణం చేసేను. గీత చేతిలో వుంది. అది అతని చేతిలో

కూడా వుంది ప్రమాణవాక్యం నా నోటిలో ధ్వనించింది అతని హృదయంలోనో!

ఆ నిముషంనుంచీ కొంతకాలం నా మనసు బాధపడింది. అనుభవహీనుడిని అజ్ఞానం నన్నలా తప్పత్రోవలోకి నెట్టివేస్తూంది తరవాత నాలుగైదు రోజులవరకూ వకుళంతో మాట్లాడలేకపోయేను. ఆమెకూడా నాతో మాట్లాడాలన్న అభిలాష అంతగా చూపలేదు.

ఒకనాడు సాయంత్రం మసక వెన్నెలలో నే నొంటరిగా పొగడచెట్టుక్రిందకూచుని, వర్షంనాటి సాయంత్రం జరిగిన సంఘటన నెమరువేసుకుంటున్నా. ఆంజనేయులు వెనకచాటునే వచ్చి కళ్లు మూసేడు నేను విదిలించుకున్నా.

'ఏమాలోచిస్తున్నావురా?'

'ఏం లేదు'

'నాకు తెలుసు'

'ఏమిటి?'

'వకుళం—'

'ఎవరన్నారు?'

'నాకు తెలుసు వకుళం అందంగా వుంటుందిరా కాని నన్ను చూస్తే దానికి వెక్కిరించాలని వుంటుంది నువ్వంటే దానికి చాలా సరదా'

'ఎప్పుడు చెప్పింది'

'ఇందాకా—వాళ్ళనాన్న గారి కెవరో పూతరేకు లిచ్చారట—నీ కిమ్మని యిచ్చింది' జేబులోంచి ఆకుమడత తీసేడు దానిలో రెండు పూతరేకులున్నాయి

'నీ కిచ్చిందా?'

'లేదు దొంగ కాని జాగ్రతగోయ్ వాళ్ల నాన్నకి తెలిస్తే నీవు యిస్త్రీ అయిపోతుం దిద్దరికీ'

'ఏమిటి తెలిస్తే—పూతరేకు యిచ్చిందనా?'

'నాకూచే యొరగవ్ కాని పోరోయ్ నాకు రోజూ రెండైనా నైవేద్యంపెడితే నీకు మంచి సాయం చేస్తా' నా మనస్సు వికసించింది. ఒక పూతరేకు వాడి కిస్తూ అన్నా 'పోనీరా—నువ్వంతా యొగతాళి చేస్తావు నాకలాంటి వుద్దేశమే లేదు'

'దాని కంటేనో'

'అబ్బే'

'అలా కాదు'

'నిజం!'

'అక్కభాస్ క్కభాస్—యేమీ యొరగవు—లబ్బుక్కలబా, లబ్బుక్కలబా' రెండో పూతరేకు కూడా వాడి కిచ్చేను అప్రయత్నంగా నాట్యంచేస్తూ పరుగెత్తేడు మళ్లీ నిశ్శబ్దం—ఒంటరితనం వకుళం పెద్ద మనిషైంది నే నింకా కాలేదు—అయేవరకూ వేచి వుండాలి కామోసు ఈ అగమ్యగోచరపు లోకంలో వున్న నన్ను 'బాబూ' అన్న పిలుపు మేలుకొలిపింది వెనుదిరిగి చూసేను పైకి! అది నన్ను రమ్మంటోంది ఎవరో పిలిచేరట యంత్రంలా దానివెంట నడుస్తున్నా

చుట్టు తిరిగి మఠంవెనక వున్న చెరువుగట్టు మీంచి సుమారు మఠం పెరటివరకూ వచ్చేను పైకి ముందు దారితీస్తూంది చెరువు నానుకొని దిబ్బ—ఆ దిబ్బ యెక్కలే పాడైన మెట్లవరస అక్కడి తలుపు లెప్పుడూ మూసివుంటాయి కాని అప్పుడవి తెరచి వున్నాయి తూర్పునుంచి వుదయేందుకిరణాలు సూటిగా గదిలో పడుతున్నాయి

ఆ మెట్లు నే నెన్నడూ యెక్కలేదు వాటి కిరుప్రక్కలా గడ్డి మొలిచి వుంటుంది చెరువుగట్టు మీంచి అక్కడకు చేరడానికి సరైనమార్గం లేదు. పైగా ఆ పెరటింటికెదురుగా చెరువుగట్టుగోడ నానుకొని వొక పెద్ద రావిచెట్టుంది మఠంలో నిర్భాగ్యురైన వొక వితంతువు సిగ్గు భరించలేక ఆత్మహత్య చేసుకోవటంచేత దయ్యమై ఆ చెట్టును పట్టివుందని పుకారు అంచేత ఆ వైంపు వెళ్ళేవాళ్లం కాము మెట్లమీద పాకుడు కూడా వుంది

మీద మెట్టెక్కి వెనక్కి తిరిగి చూసేసరికి పైకి తిరోగమిస్తూంది కారణం ఆలోచిస్తూండగా మేడ కొక్క గదిలోంచి ఘల్లుమని గాజులచప్పుడు వినపడింది కుసుమాలనుంచి హటాత్తుగా వొక కోమలాంగి వచ్చి, నావేపు చూసి 'ఓహో వచ్చావా' అన్నట్టు మందహాసం చేసింది ఆమెను చాలాసార్లు చూసేను కాని ఆ లావణ్యంతో యెన్నడూ చూడలేదు వెన్నెల చుంబించిన ఆమె పలువరసనుంచి ప్రసారితమైన కాంతులు నా కళ్లకు మిరుమిట్లు గొల్పేయి. ఆమె డాక్టరు అయ్యంగారి కూతురు—బాలవితంతువు—పేరు అలిమేలు.

'నీ పేరేమిటి?' నేను అడిగేను.

'గోపాల కృష్ణుడివా?' తమాషాగా నవ్వింది. అది కొంటెగానే వుంది కాని దానిలో వొకవిధమైన జాలి వుంది దానిలోనే యేదో కాంక్షని సూచించే ధ్వనివుంది అది జాలిగొలిపే యేదో విజ్ఞాపనపత్రంలో ముందు వ్రాసే విషయసూచిక్యంలా వుంది

బూజులు పట్టి, గోడపెళ్లలు రాలిపోయిన ఆ పాడుగదిలో, వెన్నెలవెలుగులో, ఆమె యేవో ప్రశ్నలు వేస్తూంది కాని, ఆమె మాటలు నాకు వినిపించడంలేదు నేనేవో జవాబులు చెప్తూంటే ఆమె ముసిముసి నవ్వులు నవ్వుతుంటూంది తెలుగు పలుకులమధ్య ఆమె అరవభాష వింతైన కమ్మదనం కలిగివుంది

అతను—నీతో తిరుగుతూంటారు, ఎఱ్ఱగా—ఆయన పేరేమి?'

ఈప్రశ్నతో నాకు తెలివివచ్చింది అప్రయత్నంగా 'పతంజలిశాస్త్రి' అన్నా. ఎంటనే ఆమె మాటలు నేర్చుకుంటూన్న చిలుక క్రొత్తమాట వినగానే దానిని లోలోపలే పలుకతిప్పుతూ పురస్కరించినట్లు 'పతంజలిశాస్త్రి' అని రెండుమూడుసార్లు గొణిగింది

'ఆయనకు యీ చీటీయిస్తావూ?'

మాతరామ్! నా గుండెలలో రైళ్లు నడుస్తున్నాయి

'పతంజలి శాస్త్రి అంటే యెవరనుకున్నారు? ఆయనొక మహాగ్నిజ్వాల!'

'ఈ చీటీలో అతడిని తిట్టుతూ వ్రాయలేదే!' ఆమె వెట్టుగా అంది—కాని నవ్వుతూనే

'పొగుడుతూ వ్రాసినా, వ్రాసిన మిమ్మల్నీ, అందిచ్చిన నన్నూ మసీ చేస్తాడు'

'ఫరవాలేదు ఇవ్వకూడదా' చీటీ అందిస్తూ జాలిగా పలికిన యీ వాక్యంలో వుక్రోషం ధ్వనించింది చీటి తీసుకువెళ్లి యివ్వడానికి ధైర్యంకలగలేదుగాని, ఆమెకు ఆశాభంగం కలిగించడంలో హింసగోచరించింది. సరే యిమ్మన్నా. చీటీయిచ్చినా చెయ్యి పట్టుకుని 'ఎవ్వరికీ చూపించకూ—'అంది.

చెరువుగట్టుమీద దిగి వెనుతిరిగి చూసేను. ఆమె గది గుమ్మంముందు నుంచుని చూస్తూంది నావెంపు. చందమామ ఆమె సౌందర్యాన్ని గ్రోలుతున్నాడు ఆ జ్యోత్స్నావికాసంలో ఆమె అరబ్బీరాత్రుల కథలలో యే దేవకన్యకో అనిపిస్తూంది

చీటి పట్టుకెళుతున్నా నన్న మాటేగాని అది అందివ్వడానికిగుండెలు లేవు వుంకేనకొయడికుంటే సాహసం నాలో మృగ్యం సందుమలుపు దగ్గర అయ్యంగారి మేడముందు పెద్దనీడ యేర్పడింది ఆ నీడ చేరగానే పైడి ఎన్నని అవరుద్ధ కంఠం వినిపించింది 'ఏటన్నారు బాబూ' నేను సంగతి చెప్పేను 'నా నిచ్చేస్తాను బాబూ, తెండి' ఆకీ నీడలో దాని మత్తిలోచనాలు మెరిసేయి నా తల మీంచి పర్వతం దింపినట్లయింది

నేను పిల్లిలా మా గుమ్మంముందు నిలబడి పైడి శాస్త్రిగదిలోకి వెళ్లడం, ఐదు నిమిషాల తరవాత తిరిగి రావడం చూశా అది తిరిగి అయ్యంగారింటికి ప్రదక్షిణం చెయ్యడానికి గామోసు బయల్దేరింది నేను బిక్కుబిక్కుగా దానిని సమీపించి అడిగా—

'ఏమయింది?'

'నీ టిచ్చేరు'

'నే విస్తానే'

'వెదు బాబూ నేనే యిస్తా'

'అక్కర్లేదు—నేనే యిస్తా'

'మీ నాన్నగోరితే చెప్పనా?'

నా గొంతుక తడి ఆరిపోయింది దాని కెందుకంత కోపం! అది దూరం అవుతూన్నకొద్దీ దాని తెల్లచీర వొక మచ్చలా మారుతూం దా వెన్నెలలో. అది అయ్యంగారింటి పెరటివేపు వెళ్లడం లేదు—మలుపుదగ్గరున్న పెద్ద రావిచెట్టు నీడలో కొంచెం ఆగి తిరిగి బయల్దేరింది నాకు అనుమానం వేసింది, అది తిన్నగా వెళిపోతూంటే నన్ను నేను మరిచిపోయి అలా నిలబడ్డపాళంగా, ఆంజనేయులు నా కెదురుగా వచ్చేడు వాడి నొసట విభూతిరేఖలు నడుమ సిందూరం మెరుస్తూంది

'ఏమిగోయ్! అలా నిలబడి నిద్రపో తున్నావు!'

'అలాగేరా ఎక్కడనుంచి వస్తున్నావు'?

కారం చెయ్యలేను కాని ప్రతిక్షణం నీవు మిక్కిలి కృతజ్ఞతతో వుంటాను,' అంది

ఆమె వాక్యాలు నాలో కరుణ రసాన్ని తరగ లెత్తేయి చీటి తీసుకుని బయల్దేరా కాని వీధిలోకి రాగానే హఠాత్తుగా భయం వేసింది చేసే శాస్త్రికి యిది యివ్వడమే అసంభవం! తిరిగి నా మెదడు గానుగలో చెరుకు గడలా నలిగిపోవొచ్చింది

ఎగురుతూ గా అంజనేయులు వస్తున్నాడు గబగబ చీటీ పంట్లాంజేబులో దాచేను. కాని వాడి కళ్లు తేగ కళ్లు!

'ఏమిట్రా జేబులో దాచుకుంటున్నావు? ప్రాతికేసులా వుంది!' వాడి కెప్పుడూ తింగిరి గోలే

'కాదురా—ఇప్పుడో చిక్కు వచ్చింది చాలా రహస్యంగా వుంచా లీ సంగతి—' విషయం అంతా చెప్పేను వాడు చెవులు రిక్కించి, పల్లికిలించి విన్నాడు—

'అరి మేలే! వాలేవా—సుశాస్త్రికే!' గోడల మీద వ్రాసేద్దాంరా వీళ్లపేర్లు!' వాడిని కొట్టిన చెంపకాయకి నాచెయ్యి కందిపోయింది కానివాడు తడుముకుని దులిపి వేసేడు

'నువ్విస్తావా శాస్త్రికి?'

రెండో చెంప తడుముకుని, 'ఏం—యిటు భారీగా వుంచిపోయిందనా?' అన్నాడు

'మరెలాగా?'

ఒక్క చిటిక వేసేడు, 'పోస్టు చేద్దాం'

'దేనాంతకుడివిరా అంతే!

'ఆ కృభాస్ కృభాస్, లబ్బులబా '

'అగరా—అగరా—కూచీపెమాని అలిమేలు తన యేడ్రెసు వ్రాయలేదు మరి శాస్త్రి ఆమెకెలా జవాబు వ్రాయగలడు, పోనీ లేక వ్రాయాలనే వుంటే?

'గట్టివాక్కే నువ్వు వ్రాసేయరాదూ!'

'వాట్రాతి శాస్త్రి పోల్చేస్తాడురా - నువ్వు వ్రాయ్'

'చిత్తం!'

అంతవనీ జరిగింది. పతంజలిశాస్త్రి ఆ చీటీలోని అంజనేయులు లాటిపీట వ్రాతపోల్చేసు—వాడిని తనగదిలోకి తీసుకవెళ్లి నాలుగుచెంప కాయలు లాగి, కళ్లుమ్రుచ్చుకు నేసరికి వాడు సంగతి అంతా తుద తప్పకుండా చెప్పివేసేడు. శాస్త్రి నన్ను పిల్చి పడచివాట్లు వేసేరు, 'చేసిపోవడానికి యిష్టంగా వుందా? మీ వాళ్లతో చెప్పనా? తెలివైనవాడివి, బాగుపడతావని, నీ మీద యింత శ్రద్ధతీసుకుంటున్నా—నువ్విలా సంచరిస్తే, నాతో తిరుగుతూండడం చేత నాకు అపఖ్యాతి వస్తుంది ఈ అలిమేలు మ్లేచ్ఛురాలు—దానివద్దకు నువ్వెందుకు వెళ్ళేవూ? ఇక ఎన్నడూ వెళ్ళకద్దు—తెలిసిందా? ఓయ్ అంజనేయులూ, మళ్ళీ యిలాంటి పనిచో యిచ్చేవా, నీ తోక తెగగోస్తా' అంజనేయులు తోచి వెక్కిరిస్తూ పారిపోయేడు నేనుమాత్రం బరువుగా కాళ్లీడ్చుకుంటూ వెళిపోయేను

నేను వారంరోజులవరకూ ఎవరితోనూ మాట్లాడలేను మఠంలో కాలు పెట్టలేను వరుశాన్ని రెంకుమూడుసార్లు దూరం నుంచే తప్పించుకొన్నా అపిల్ల పిల్చింది కూడా నేను లెక్క చెయ్యలేదు

కాని ఆవేళ నేనొంటరిగా సాగడిచెట్టు ప్రక్క అరుగుమీద కూచున్నాను ఎండ తీక్ష్ణంగా వుంది వరుశం జివకటాటుగా వచ్చి నా మెడమీద వ్రాలింది నేను వెనక్కు తిరిగేను ఆమె నవ్వింది

నేను దిగులుగా అడిగేను 'నామీద కోపం వచ్చిందా?'

ఇది ప్రేమికుడు అను నిత్యం యిన్నో సందర్భాలలో వేసే పట్టిప్రశ్న లేదని జవాబు రావాలని కోరి వేసే ప్రశ్న యిదొక్కటే ప్రేమ విషయంలో ఈ ప్రశ్న వెనిజవరకామె కెన్నిసార్లో వేసేను అప్పుడామె దానిని గ్రహించే పరిస్థితిలో లేదు—కాడో—సంగతి తారుమారైంది ఆమె చెరచెరవచ్చి. నేను మెళ్లెక్కుతూ వగంలో గగి, నిటగోడ మీద గడ్డం ఆనించి, మెరిసే నేత్రాలతో, బుంగమూతితో 'రా' అంది అది మా ద్వితీయ సమాగమం—అద్వితీయ సమాగమం

తరువాత గాలికోసం కిటికీ తలుపులు తెరిచి [illegible]

